# మిసిమి

"All that we are is the product of what we have thought"
is "We are what we think." — Dammapada.

సంపుటి 10 ఏప్రిల్ 1998 సంచిక 4

వ్యవస్థాపక సంపాదకుడు : డాక్టర్ **రవీంద్రనాధ్ ఆలపాటి**



విడిప్రతి రూ. 6/- వార్షిక చందా రూ. 70/-

ముఖచిత్రం : **డేవిడ్ హామిల్టన్ 'అమ్మాయి'**

Printed & Published by BAPANNA ALAPATI at Kala Jyothi Process Ltd.
1-1-60/5, R.T.C. X Roads, Musheerabad, Hyd-20. Ph. 7645536

సంపాదకుడు : **అన్నపరెడ్డి వెంకటేశ్వర రెడ్డి**

# DEMOCRACY AT PLAY

**- by Sunil Khilnani**

The sparring between Congress and the BJP should not be mistaken for a sign that electoral politics has entered an era of two-party democracy. The truth-like any about Indian politics-is more complicated and uncertain. In fact, the crucial kingmakers are now the smaller regional parties, none of which sends more than a score of representatives to India's lower house of parliament, the Lok Sabha Bolstered by economic liberalization that has devolved real powers to regional governments, these parties have acquired a taste for national power through participating in the outgoing United Front coalition government. Indian elections are being played out in neither a one - party nor a two - party system, but in something more original, where national and regional parties are blurring into one another, and where parties often have only a mirage - like, one-election existence.

But underlying this surface haze, the newfound ubiquity of elections has a deeper explanation. It is the product of a drastic simplification in the meaning of democracy. True, democracy has taken root in India. But as it has penetrated the society, spreading a sense of political quality and subverting old hierarchies,. it has also suffered a menacing reduction to a single meaning: elections In any modern democracy, elections are part of a broader set of rules and habits that govern the exercise of power. Yet these rules and habits have come to be insouciantly shrugged aside by India's politicians, to whom democracy signifies simply a method of winning power.

The inflated importance given to elections has troubling consequences for how political parties now muster support. Increasingly, they rely on inciting identities of caste, religion and region (a task for which criminals and corruption will do nicely). Elections have thus been transformed into spectacles of self - expression - for many, voting is now primarily a way to affirm an identity, rather than to weigh choices about the exercise of political power. And this regular incitement to new and more kaleidoscopic identities makes it still harder for any single party to try to represent the fragments. It is a classic double bind. the absence of a dominant national party provokes elections, but these in turn make it more difficult for such a party to emerge

Elections are necessary to the functioning of a modern democracy, but they are not the only requisite. The procedural manners of routine government are as important. If Indians are to spare themselves from an obsessive passion for elections, they must recover the other meanings of democracy: moderation, rule-following, a capacity to learn and, above all, patience. This is asking at lot of India's political elite as well as its increasingly restless citizenry. But, as the latest experience of coalition government has shown in glimpses, there is a ramshackle way of doing it.

- COURTESY TIME

# విలువలకు సర్వకాలీనత ఉండదు

## నోబెల్ బహుమతి ఉపన్యాసం, 12, డిసెంబర్, 1976

రచయిత : సాల్‌బెల్లో అనువాదం: బి. వెంకటరామిరెడ్డి

నలభై ఏళ్ళ క్రితం నేనొక విచిత్రమైన అండర్ గ్రాడ్యుయేట్‌గా ఉండేవాణ్ణి ఒక కోర్సు చదవడానికి పేరు నమోదుచేసుకోవడం, వేరే సబ్జెక్టు చదువుతూ గడపడం ఆవిధంగానే 'మనీ అండ్ బాంకింగ్' చదువుతున్న రోజుల్లో జోసఫ్ కాన్రాడ్ నవలల్ని చదువుతూ ఉండేవాణ్ణి అలాచదవడంలో నాకెలాంటి పశ్చాత్తాపాలూ లేవు. కాన్రాడ్ నాకు బాగా నచ్చడానికి కారణం అతను నాకు అమెరికన్‌లా అనిపించేవాడు అతను తన పోలిష్ భూమినుండి పెకలింపబడ్డ మొక్కలాంటి వాడు ఫ్రెంచి మాట్లాడేవాడు, ఇంగ్లీషులో శక్తివంతంగా, అందంగా రచనలు చేసేవాడు. చికాగోలో పెరిగిన వలస బిడ్డనైన నాకు తూర్పుయూరోపు ప్రాంతానికి చెంది, ఆ భాషను మాట్లాడుతూ, నావికాదళంలో కెప్టెన్ అయి, ఓరియంటల్ ఇంగ్లీషులో రచనలు చేసిన అతనంటే సహజంగానే అభిమానం ఏర్పడింది అయితే, కాన్రాడ్ నిజజీవితంలో అత్యుక్తి ఏమీలేదు అతని కావ్య వస్తువులు ముక్కుసూటిగా ఉంటాయి అందుకే అతని రచనల్లో స్థిరమైన నమ్మకం, అధికారం, సముద్రానికి సంబంధించిన ప్రాచీన నమ్మకాలు, అధికార తారతమ్యాలు, తుఫానుల్లాంటివి వొచ్చినపుడు వాళ్ళు అనుసరించే సున్నితమైన శాసనాలు .. ఇవన్నీ అతని రచనల్లో దర్శనమిస్తాయి. కళవిషయంలో అతనికున్నటువంటి నమ్మకాలు - 'ది నిగ్గర్ ఆఫ్ నార్సిసస్' అనేపుస్తకానికి అతను వ్రాసుకున్న ముందుమాటలో సూటిగా చెప్పబడ్డాయి. కనిపించే ప్రపంచానికి అత్యున్నతమైన న్యాయాన్ని చేకూర్చడమే కళయొక్క ప్రయత్నం జీవితానికి సంబంధించిన నిజాలు, సందర్భాలు, వాటికి సంబంధించిన మూలాలు, అవసరమైనవీ, నిలిచేవీ, వాటికి సంబంధించి అత్యున్నతమైన న్యాయాన్ని చేకూర్చడమే కళయొక్క ప్రయత్నం ఈ విషయంలో శాస్త్రవేత్త, మేధావి లాంటి వారికంటే రచయిత పాత్ర భిన్నమైనది. ఒక పద్ధతి ప్రకారం పరీక్షించి కాన్రాడ్ ఈ విషయాన్ని గ్రహించాడు. ఆవిధంగా అతను మన జీవన మూలాలకు ఆనందించేట్టు, ఆశ్చర్యపడేట్టు మన జాలి, బాధల విషయంలో అందరితో పంచుకునేట్టు, కనుపించని మానవ హృదయాల ఒంటరితనాన్ని కలిపేట్టు, చనిపోయిన వారిని జీవించి ఉన్న వాళ్ళతో, జీవించి వున్న వాళ్ళను పుట్టబోయేవాళ్ళతో అనుసంధించేందుకు ప్రయత్నించాడు

ఎనభై సంవత్సరాల క్రిందట అతను చెప్పిన దానికి మనం కాస్త వర్తమాన లవణాన్ని చేర్చాలనుకుంటున్నాం. నేను, గొప్పగా ధ్వనించే 'మానవత్వం' 'తిరుగులేని నమ్మకం' లాంటి మాటల్ని వొప్పుకోని ఎర్నెస్ట్ హెమింగ్వే తరానికి చెందిన వాణ్ణి ఉడ్రోవిల్సన్, ఇతర రాజనీతిజ్ఞుల మాటలకు ప్రభావితులై, మొదటి ప్రపంచయుద్ధంలో పాల్గొని, డేరాల్లో శవాలై బిగిసిపడివున్న వాళ్ళకోసం హెమింగ్వే రచనలు చేశాడు హెమింగ్వేని చదివే యువపాఠకులు ఇరవయ్యో శతాబ్దపు భయానకాలు, మానవత్వపు నమ్మకాలను చంపివేశాయని నమ్మారు. అందుకే నేను కాన్రాడ్ రచనా చాతుర్యాన్ని ఆపుచేయాలని అనుకున్నాను. అయితే ఆయన పొరబడ్డాడని నేనెప్పుడూ అనుకోలేదు. అతను నాతో సూటిగా మాట్లాడాడు మనుషుల్లో కనుపించే బలహీనతను తన బలహీనతగానే అతను భావించాడు. అయితే, తన బలహీనతను వేరు తనాన్ని అంగీకరించి, తనవొంటరి తనాన్ని గుర్తించినట్లయితే తనలాంటి వొంటరిజీవులతో తనసాన్నిహిత్యాన్ని గుర్తించి ఉండేవాడు.

ఇప్పుడు కాన్రాడ్ వాక్యాలమీద అవిశ్వాసలవణాన్ని చల్లవలసిన అవసరంలేదు. అయితే,

అదేరకమైన ఇతరనవలల్లాగే కాన్రాడ్ నవలలు వెళ్ళిపోయాయి. ఉదాహరణకు ఫ్రెంచి సాహిత్యానికి నాయకుడిలాండివాడైన అలైన్ రాబ్ గ్రిల్లెట్ - ''నేటి గొప్ప రచనలనిపించుకుంటున్న సార్త్రే 'నాసియా', కామూ 'దిస్ట్రేంజర్', కాఫ్కా 'దికాజిల్' లాంటి రచనల్లో పాత్రలులేవు ఆ పుస్తకాల్లో పాత్రలకు బదులుగా తత్వాలే ఉన్నాయి'' - అన్నాడు. పాత్రల నవల గతకాలానికి చెందినది ఆ నవల మనుషులు ఒకరికొకరు దూరంగా ఉన్న కాలాన్ని వర్ణించింది - అన్నాడు ఇది నిజంగా ఏదో సాధించినట్టుకాదు అది నగ్నసత్యం. వ్యక్తులు తుడిచివేయబడ్డారు. ప్రస్తుతకాలం పాలనా సంఖ్యకు సంబంధించినది. ఏవో కొన్ని కుటుంబాలతో, వ్యక్తులతో, వారి ప్రగతి, పతనాలతో ఈ నాటి ప్రపంచపు పరిణామం ముడిపడిలేదు. బాల్జాక్ బూర్జువా రోజుల్లో పేరు, వ్యక్తిత్వం చాలా ప్రాధాన్యత వహించాయి. జీవిత సంఘర్షణలో విజయాన్ని సాధించడంలో వ్యక్తిత్వం ప్రధాన పాత్రవహించింది. ఆ రోజుల్లో ప్రపంచంలో ఒక ప్రత్యేకమైన వ్యక్తిత్వం కలిగి ఉండడం అవసరంగా ఉండేది. అప్పుడు వ్యక్తిత్వం ఏది సాధించాలన్నా పనిముట్టుగా ఫలితంగా ఉండేది. కాని, మన ప్రపంచం చాలా అణకువగలది. అది వ్యక్తి యొక్క సర్వశక్తి మంతత్వాన్ని త్యజించింది. అయితే ఈ ప్రపంచం చాలా అత్యాశాపరమైనది. ఇది అనంతాల్లోకి చూస్తున్నది మానవత అనేది విస్తృతమైన ఆలోచనలకు తావిస్తున్నది.

ఇలాంటి సందర్భాలలో నాకు తాత్త్విక చర్చ చేయాలని లేదు. పాత్రలంటే మనం ఎందుకు విసుగు చెందావెూ మనందరికీ తెలుసు. రకరకాల మానవపాత్రలు తప్పులతడకలై బోరుకొట్టేస్తున్నాయి. ఈ శతాబ్దారంభంలో డి.హెచ్. లారెన్సు మానవుల సహజాతాలను ప్యూరిటానిజం ఎలా పాడుచేసిందో తెలియజేశాడు. ఇప్పుడు ప్యూరిటానిజం మానవసహజాతాలు ఒకదానితో ఒకటి విభేదిస్తున్నాయి. ''దయా హృదయం బ్రద్దలయింది. మనం ఒకరి శ్వాసలో ఒకరం మునిగిపోయాం!'' - అన్నాడు. అంతేగాక యూరోపులో పురాణాల ప్రభావం శతాబ్దాలుగా ఉంటూవొచ్చింది. ప్రతిదేశమూ కొన్ని గుర్తించదగిన పురాణవ్యక్తిత్వాల్ని కలిగి ఉంది. మోలియర్, రేసిన్, డికెన్స్, బాల్జాక్ లాంటివాళ్ళ పాత్రలు అలాంటివే అదొక భయంకరపరిణామం. ఈ పద్ధతి పాతపట్టణాల శిధిలాల ఆధారంగా కొత్త పట్టణాల్ని నిర్మించినట్టుంది.

అయితే నేనిక్కడ ఆర్టిస్టు ఇచ్చుకునే ప్రాముఖ్యతను గురించి చెప్పదలుచుకున్నాను. అతను తప్పకుండా చారిత్రక విశ్లేషణతో రచన ప్రారంభించక తప్పదు. ''టైం రిగెయిన్డ్'' లో ప్రౌస్ట్ తెలివైన యువపాఠకుల్లో ఉన్నతమైన విశ్లేషణ, నీతి, సాంఘిక విషయాలను గురించిన విషయాలపై పెరుగుతున్న ఇష్టతను గురించి చెప్పాడు. అలాంటిపాఠకులు బెర్గాట్ లాంటి రచయితలకే ప్రాధాన్యతనిస్తున్నారు అయితే కళాత్మక రచనల్ని హేతువుతో బేరీజు వేసినప్పుడు ఏదీ స్థిరంగా నిలవదు. ప్రతివొక్కరు తమకిష్టమైన రచనను గొప్పదని నిరూపించవచ్చు.

రోబ్‌గ్రిల్లెట్ సందేశం కొత్తదేమీ కాదు. ఆ సందేశం మన బూర్జువా లక్షణాల్ని తుడిచివేయమంటుంది. ''యాభైసంవత్సరాల జబ్బు ఇది. సీరియస్‌గా వ్యాసాలు వ్రాసేవాళ్ళు దీనికెప్పుడో చావునోటీసిచ్చారు. అయినప్పటికీ పంధొమ్మిదో శతాబ్దం దానిని నిలిపిన ఉన్నతస్థానంనించి దాన్నెవరూ తుడిచిపెట్టలేకపోయారు. అది ప్రస్తుతం 'మమ్మీ' స్థితిలో ఉంది. ఇంకా పాత కాలపు విమర్శతోనే దాన్ని ఆదరిస్తున్నారు.'' - అని గ్రిల్లెట్ అన్నాడు.

రాబ్‌గ్రిల్లెట్ వ్యాసం - '' ఆన్ సెవరల్ అబ్సలీట్ నోషన్స్'' లో ఈ విషయం చెప్పబడింది. నా మటుకు నేను మమ్మీలతో, కాలం చెల్లిన నమ్మకాలతో విసిగిపోయాను. అయినా మహారచయితల నవలల్ని చదవడంలో నేను విసిగిపోలేదు. వారి నవలల్లోని పాత్రలతో ఏంచేయాలి? వాటిని గురించి విశదీకరించిన విషయాలు చచ్చిపోయాయా? మానవులు కల్పాంతానికి చేరుకున్నారా?

వ్యక్తిత్వం అనేది జాతి సంస్కృతి, పరిస్థితులమీద ఆధారపడివుంటుందా? ఆ పరిస్థితుల్ని మనం వొప్పుకుంటామా? వ్యక్తులమీదగాక వారి ఆలోచనలలోనే ఈ సమస్య ఇమిడి ఉంటుందనుకుంటాను. ఈ సమస్య పరిష్కారాన్నే మనం ఆలోచించాల్సివుంది.

పాత్రలకు మరణశాసనం విమర్శకులే ఇచ్చారనడంలో అర్థం మరొక మమ్మీ గ్రూపుకు వాళ్ళు, అంటే మేధావి వర్గానికి చెందిన గౌరవనీయులు ఈ కొత్త సిద్ధాంతాన్ని ఏర్పరిచారన్నమాట. ఆ సీరియస్ వ్యాసరచయితలే సాహిత్య విషయాల్లో మరణ శాసనాల్ని విడుదల చేయడం అనేది నాకు హాస్యాస్పదమనిపిస్తుంది. కళ సంస్కృతిని అనుసరించాలా? ఎక్కడో పొరబాటుజరిగింది.

నవలాకారుడు తన నవలలోని విషయానికి పాత్ర అక్కర్లేదనిపించి పాత్రల్ని వొదిలేయడంలో తప్పేముంది? అయితే అతను సిద్ధాంతం మీద ఆధారపడి అట్లాచేయడం అర్థరహితం. పాత్రలు రచయితలచేత సృష్టించబడవు - అన్నాడు ఎలిజబెత్ బోవెన్. పాత్రలు ఎప్పుడూ ఉంటాయి. వాటిని రచయిత కనుక్కోవాలి. వాటిని కనుక్కోలేకపోతే అది రచయిత పొరబాటే. అయితే, పాత్రల్ని కనుక్కోవడం అంతసులభమేమీ కాదు. మానవుల స్థితిని వివరించడం చాలాకష్టతరం. మనం ప్రపంచ చరిత్ర ప్రారంభదశలోనే ఉన్నామనే వారి మాట నిజం మనం కొత్త వివేకానికి సంబంధించిన బాధను అనుభవిస్తున్నాం అమెరికాలో గత నలభై సంవత్సరాల్లో అనేక మిలియన్ల మంది ఉన్నతవిద్యను పొందారు ఇది చాలామంది విషయంలో సందిగ్ధమైన వరం.

ప్రతి సంవత్సరం ఎన్నోపుస్తకాలను చూస్తున్నాం. అవన్నీ అమెరికన్లకు తామున్నస్థితిని తెలియజేస్తున్నాయి. ఇదివరలో జెసూట్‌గా వున్న మలాఛి మార్టిన్ చర్చిని గురించి వ్రాసిన తనపుస్తకంలో ఆధునిక అమెరికన్‌ను మైఖెల్ ఏంజిలో శిల్పంతో పోల్చాడు. అతనికి ఆధునిక అమెరికన్‌లో సమగ్రతకోసం పడుతున్న అసమగ్రమైన తపన కనుపించింది. అమెరికన్ బందీ ఆపాదనలు, ముందుజాగ్రత్తలు, వర్ణనలు మొదలైన సంఘర్షణల్లో మునిగి పోయి ఉన్నాడు. ఆసంఘర్షణలో తననితానే ప్రవక్తగా, పూజారిగా, న్యాయనిర్ణేతగా నిర్ణయించుకున్న వారి ప్రభావంలో తలమునకలై ఉన్నాడు.

ఈ ప్రసవవేదనను గురించి కొద్దిగా వివరిస్తాను. వ్యక్తిగత జీవితం గందరగోళం, భయానకం. కుటుంబాల్లో భర్తలకు భార్యలకు, తల్లి దండ్రులకు పిల్లలకు అయోమయస్థితి. సాంఘిక వ్యవహారాల్లో, వ్యక్తిగతమైన అణకువల్లో, లైంగిక విషయాల్లో ఇంకా భయంకరమైన అయోమయస్థితి. ఈ వ్యక్తిగతమైన గందరగోళ పరిస్థితుల్లోంచే ఉద్భవించిన సామాజికమైన గందరగోళ పరిస్థితులు - మనం చదువుతున్న వార్తాపత్రికల్లో అహ్లాదాన్ని కలిగించే సైన్సుఫిక్షన్ - న్యూయార్క్ టైమ్స్ పత్రిక మృత్యుకిరణాల్నిగురించి, అమెరికన్, రష్యన్ ఉపగ్రహాలు రోదసిలో జరిపే యుద్ధాన్ని గురించి వ్రాస్తుంది. అంతేకాదు, నవంబరునెల ' ఎన్‌కౌంటర్' లో బాధ్యత కలిగిన నాసహోధ్యాయి, ఆర్థిక శాస్త్రవేత్త - మిల్టన్ ఫ్రీడ్‌మన్ 'గ్రేట్‌బ్రిటన్' ఇప్పటిలాగే ఖర్చుచేస్తూపోతే త్వరలో చిలీలాంటి పేద దేశాలస్థితికి దిగజారుతుందని వ్రాశాడు. అతను తను చెప్పిన జరగబోయే స్థితికి తానే బాధపడిపోయాడు. ఏమీ - స్వేచ్ఛ, ప్రజాస్వామ్యహక్కుల్ని ప్రారంభించిన మేగ్నాకార్టా చివరికి నియంతృత్వంలో అంతమౌతుందా? అనూచానంగా వొస్తున్న ఆపద్ధతిలో పెరిగివొచ్చినఎవరికైనా బ్రిటన్‌స్వేచ్ఛను, ప్రజాస్వామ్యాన్ని పోగొట్టుకునే ప్రమాదంలో ఉన్నదని అనలేరు. అది నగ్నసత్యం.

ఇలాంటి నిజాలేమనల్ని భూమ్మీద పడేస్తుంటాయి. నేనుగనక ప్రొఫెసర్ ఫ్రీడ్మన్‌తో చర్చించినట్లయితే సంస్థల యొక్కశక్తి గ్రేట్ బ్రిటన్‌కీ, చిలీకీ మధ్యవున్న సాంస్కృతికమైన తేడాలు, జాతీయవిషయాలు, ట్రెడిషన్ విషయంలో వాటిమధ్య ఉన్నవైరుధ్యాలు మొదలైనవాటిని

పరిగణనలోకి తీసుకోమనేవాణ్ణి. అయితే, చర్చించడం విభేదించడం నాకు యిష్టంకాదు. నేను డిబేట్‌లో గెలవలేను. నేనుకోరేదల్లా మనం వేటితో జీవించాలో అలాంటి భయంకరమైన ఊహాగానాల్ని, గందరగోళపరిస్థితుల్ని, ఊహాశిథిలావస్థల్ని గురించి ఆలోచించమంటున్నాను.

అదే ఎన్‌కౌంటరులో మరొకపేజీలో ప్రొఫెసర్ వాట్సన్, జార్జి కెన్ ఈ మధ్య నిర్వహించిన అమెరికన్ సొసైటీ పతనావస్థను గురించిన చర్చ, దానివల్ల ప్రపంచంలో రాబోయే పరిణామాల వివరణ ఉంది. ''నిర్ణయాలు తీసుకునేవారూ, నిర్ణయాలు చేసేవారిని ప్రభావితం చేసేవారూ అయిన ఉన్నత వర్గానికి చెందిన 1,00,000 మంది స్త్రీ పురుషులు రాజీపడిపోవడానికి సిద్ధపడ్డప్పుడు అలాంటి సంఘాన్ని ఏదీ రక్షించలేదు'' అన్నాడు.

అదీ పెట్టుబడిదారీ సూపర్ పవర్ స్థితి! అయితే దానికి వ్యతిరేకమైన ఆదర్శవాదుల పరిస్థితి ఎలా ఉంది? అదే ఎన్‌కౌంటర్‌లో కేంబ్రిజ్‌లో ఆంగ్లోపన్యాసకుడుగా పనిచేస్తున్న జార్జివాట్సన్ వామపక్షాల్లోని జాతి వాదాన్ని గురించి వ్రాశాడు. సోషల్ డెమొక్రాటిక్ ఫెడరేషన్‌ను స్థాపించిన హిండ్మన్ దక్షిణాఫ్రికాయుద్ధాన్ని యూదుల యుద్ధం అన్నాడు. వెజ్‌లు కొన్ని సమయాల్ని జాత్యభిప్రాయాల్ని వెలిబుచ్చినట్టు వ్రాశాడు. ఎంగెల్స్ తూర్పు యూరోపుకుచెందిన స్లావ్ ప్రజలు విప్లవ వ్యతిరేకులుగా భావించి వాళ్ళను మనుషులుగా గుర్తించలేదని వ్రాశాడు ముగింపులో వాట్సన్ పశ్చిమ జర్మనీకి చెందిన ఉల్రిక్ మీనోఫ్ స్టేట్‌మెంటును ఉదాహరిస్తూ రెడ్ ఆర్మీపక్షం 1972లో ఒక జ్యుడీషియల్‌హియరింగ్‌సందర్భంలో రివల్యూషనరీ ఎక్స్‌టెర్మినేషన్‌సమర్థించినట్టు వ్రాశాడు ఆమెకు హిట్లరుకాలానికిచెందిన జర్మన్‌యాంటీసెమిటిజం ప్రత్యేకంగా పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకమైనదని నమ్మకం. ఆమె చెప్పినట్లుగా ఆరుమిలియన్ల యూదులు చంపబడి యూరోపు పెంటకుప్పలమీద పారవేయబడ్డారనీ, వారంతా యూదులనీ చెప్పబడింది.

వామపక్షీయుల ఈ నిజాల్ని నేను ఎందుకు గుర్తుచేస్తున్నానంటే మనకు వెలుగుపిల్లలు, చీకటిపిల్లలు అనే తేడా లేదని చెప్పడానికే. రాజకీయాలతోబాటు మంచి చెడ్డలనేవి పంచిపెట్టబడలేదు. నావాదనల్లా మనం అన్ని ఉత్సాహాలకు ఆహ్వానం పలుకుతున్నామని ప్రతి విషయంయొక్క ఔన్నత్యపతనాలు మన నిత్యజీవన భయంలోని భాగాలే. మనం వ్యక్తిగత జీవితాల్లో భయపడుతున్నాం, పబ్లిక్ ప్రశ్నలతో హింసింపబడుతున్నాం.

మరి కళ, సాహిత్యాల సంగతేమిటి? భయంకరమైనగోల. కాని, మనం దానికి లొంగిపోలేదు. మనం ఇంకా ఆలోచించగలిగే, విచక్షణతో చూడగలిగే, అనుభూతించగలిగే ఉన్నాం. శుభ్రమైన, సంక్లిష్టమైన, ఉన్నతమైన కార్యకలాపాలకు, కోపతాపాలకు లొంగిపోలేదు. పుస్తకాలు వ్రాయబడుతున్నై, చదవబడుతున్నై, ఆధునికపాఠకుడి సుడిగుండంలాంటి మనసును అర్థంచేసుకోవడం కష్టం కావొచ్చు. కాని, ఆ గందరగోళాలనించి ప్రశాంతమైన ప్రాంతానికి చేరుకోవడం సాధ్యమే. ఆ ప్రశాంతప్రాంతంలో అతను మనకోసం నిరీక్షిస్తూ ఉండవచ్చు. సమస్యలు పెరిగినపుడు అవసరమైనవాటికోసం తపనపెరుగుతుంది. మొదటి ప్రపంచయుద్ధంతో ప్రారంభమైన అనంతమైన సమస్యలవలయం ఒక విచిత్రమైన మనిషిని తయారుచేసింది. అతను భయంకరమైన సంఘటనల్లోంచి జీవిస్తూ వచ్చాడు. అతనిలో ఎన్నో ప్రెజుడిస్‌లు. నిరాశాజనకమైన ఆదర్శాలను వొదిలేశాడు. అనేకరకాలైన పిచ్చిలక్షణాలతో కలిసిబ్రతకడం అలవాటు చేసుకున్నాడు. స్వేచ్ఛ, జ్ఞానం అనేకలకాలం నిలిచేవాటి మీద విపరీతమైనకోరికను పెంచుకున్నాడు. నేను ఈ విషయాలను గోరంతలు కొండంతలుగా చేసి చెప్పడం లేదు. అందుకు చాలా నిదర్శనాలున్నాయి. అవును, పతనమే. ఎన్నో పతనమౌతున్నాయి. ఇది చాలాకాలం నించి జరుగుతోంది. ప్రౌస్ట్ 'టైం రిగెయిన్డ్' చదివితే అతను ఈ విషయాన్ని బాగా గ్రహించాడని

అర్థమౌతుంది అతని నవల గ్రేట్ వార్ కాలంలో ఫ్రెంచి సమాజాన్ని గురించి వివరిస్తుంది. ఆవిధంగా అతను తనకళను పరీక్షించుకున్నాడు. కళలేకుండా మనల్ని మనమూ, ఎదుటివాళ్ళను కూడా అర్థంచేసుకోలేము. కళ అహం, వాంఛ, తెలివినిఛేదించగలుగుతుంది మనకు కనుపించని మరొక వాస్తవికత ఉంది అది మనకు ఎప్పుడూ సూచనలను యిస్తూ ఉంటుంది కళలేకుండా ఆసూచనలద్వారా అందే వాస్తవికతను గ్రహించలేము ప్రౌస్ట్ వీటిని 'వాస్తవ ప్రభావాలు' అన్నాడు. ఆ 'వాస్తవ ప్రభావాలు' కళలేకపోతే మన భావనకు అందవు. అప్పుడు మనకు మామూలు జీవితానికి సంబంధించిన పారిభాషిక పదాలే మిగులుతాయి. దాన్నే మనం తప్పుగా 'జీవితం' అని చెప్పుకుంటాము. టాల్‌స్టాయ్ చెప్పిందీ అదే. అతని 'ఇవాన్ఇల్యిచ్' ఇవే మామూలు విషయాలను వర్ణిస్తుంది అవి జీవితాన్నీ మృత్యువునూ మననించి దాచిపెడతాయి. చివర్లో, తన బాధలో 'ఇవాన్ ఇల్యిచ్' ఒక వ్యక్తిగా, పాత్రగా రూపొందుతాడు. ఆప్రయత్నంలో అతను మామూలు విషయాలను చూస్తూ తెరలన్నీ చీల్చిచూస్తాడు.

ప్రౌస్ట్ కళకీ, వినాశనానికీ మధ్య సమతౌల్యాన్ని పాటించాడు. కళ జీవితానికి అత్యవసరమైనదనీ, అది స్వతంత్రమైన వాస్తవమనీ, దానికి ఇంద్రజాలంలాంటి శక్తి ఉన్నదనీ అన్నాడు గతంలో కళ ప్రధానమైన పూనికతో అనుసంధింపబడలేదు. ''కళ మానవునియొక్క ప్రధాన శక్తులను పట్టిచుకోలేదు'' అని హెగెల్ అన్నాడని చరిత్రకారుడు ఎడ్గార్‌విండ్ '' ఆర్ట్ అండ్ అనార్కీ'' అనే తన పుస్తకంలో వ్రాశాడు. ప్రస్తుతం ఈ ప్రధానశక్తులను శాస్త్రవిజ్ఞానం పట్టించుకుంటున్నది. దానినేమనం - 'శాంతినెరుగని హేతువాదపరిశీలనాత్మకత' అంటున్నాం. కళ ప్రక్కకు తప్పుకున్నది. అది విశాలమైన గొప్ప భిన్నత్వాల ఆకాశపుటంచులను ఆవిష్కరించింది. శాస్త్రసాంకేతిక యుగంలో కూడ కవిత్వాన్ని వ్రాస్తున్నారు, బొమ్మలు చిత్రిస్తున్నారు. ''ఆధునిక రచనల్లో కళ ఎందరు గొప్ప దేవుళ్ళ లాంటివాళ్ళను సృజించినా, వారిలో ఎంత సమగ్రత, గొప్పదనం కనుపించినా వాటివల్ల ప్రయోజనం లేదు. మనం వాళ్ళముందు మోకరించలేము'' అని హెగెల్ అన్నాడు. గతంలో భక్తితో మోకరిల్లే వాళ్ళం. బుద్ధికుశలత, సాహసవంతమైన పరిశోధనలు, కళస్థానాన్ని ఆక్రమించాయి. శుభ్రమైన కళకు పూర్వపు బాధ్యతలనుండి స్వేచ్ఛ ప్రసాదింపబడింది. దానిని ఇప్పుడు సీరియస్‌గా తీసుకోవలసిన అవసరంలేదు. అంతేగాక కళ ఆత్మను బాధాకరమైన వాస్తవానికి సంబంధించిన లోపాలనుండి విముక్తం చేసింది. ప్రస్తుతం శాస్త్రవిజ్ఞానానికి సంబంధించిన హేతువాద పరిశీలనాత్మకతో మనిషిలోని శక్తులకు పనికల్పిస్తోంది. ప్రస్తుతం మనిషి అంతరంగం నేను చెబుతూ వస్తున్న గందరగోళాలతో నిండిపోయివుంది.

19వ శతాబ్దపు యూరోపియన్‌రచయితలు సాహిత్యాన్ని మానవప్రయత్నంతో ముడిపెట్టడం మానలేదు. అసలు అలాంటి ప్రయత్నమే టాల్‌స్టాయినీ, డోస్టవస్కీనీ అయోమయపరిచి వుండేది. కాని, పశ్చిమదేశాల్లో గొప్పకళాకారులకీ, ప్రజలకీ మధ్య ఎడబాటు ఏర్పడింది. ఆ రచయితలు మామూలు పాఠకులమీదా, బూర్జువా జనంమీద ఒకరమైన అసహ్యతను ఏర్పరచుకున్నారు. వారిలో అత్యుత్తమైన రచయితలు యూరోపు సృష్టించిన సంస్కృతి, దానినించివొచ్చిన అనిశ్చితమైన మారుతున్న లక్షణాలను గ్రహించారు. వీరిలో కొందరు చిత్రమైన, అర్థం కాని భయంకరమైన రచనలు చేశారు. అవి ప్రజల్లో వ్యతిరేకమైన, అతితీవ్రమైన అభిప్రాయాలను రేకెత్తించాయి. ఆ రచయితల్లో చాలమంది ప్రజలకు తమరచనలు అర్థం అయ్యేట్టు చేయడానికి ప్రయత్నించలేదు.

20వ శతాబ్దంలో కూడ ప్రధానమైన ప్రభావం వాళ్ళదే. వాళ్ళు 19 వశతాబ్దపు రచయితలనే అనుసరించారు. వాళ్ళలాగానే చరిత్ర, సమాజాలను విశ్లేషించారు. ప్రస్తుతం రచయితలకు

సాహిత్యం మళ్ళీ మనిషియొక్క ప్రధానశక్తులను ప్రభావితంచేయాలనీ, అందుకోసం వాస్తవమూ, మామూలు అయిన పద్ధతులవేపు మళ్ళవలసి ఉందనీ అర్థంకావాలి.

అయితే వెనక్కురావాలనుకున్నంత మాత్రాన అదిసాధ్యంకాదు పరిస్థితులవొత్తిడి మనల్ని అందుకు ఆజ్ఞాపిస్తుంది అందుకు నివారణలు సూచించి లాభం లేదు. రచయితలు ఏంచెయ్యాలో ఎవరూచెప్పలేరు, చెప్పకూడదు భావన తన మార్గాన్ని తనే ఎంచుకోవాలి. రచయితలు మానవసమాజానికి సరిపడినంతగా ప్రాతినిధ్యం వహించడం లేదు. అమెరికన్లకు ఎందరు రచయితలున్నారు? మనస్తత్వశాస్త్రవేత్తలు, సామాజికశాస్త్రవేత్తలు, చరిత్రకారులు, జర్నలిస్టులు, రచయితలు మొదలైన వారిసంఖ్య ఎంత? ఈ వొప్పుకున్న ఊహాచిత్రాలు నాకూ, రాబ్‌గ్రిల్లెట్‌కీ బోరుకొట్టించాయి అందుకే మా పుస్తకాల్లోకి సివిల్ సర్వెంట్‌నీ, ఫుట్‌బాల్ ఆరాధకుణ్ణీ, ప్రేమికుణ్ణీ, టెలివిజన్ రివ్యూయర్నీ, కన్సూమర్నీ తీసుకున్నాం. ఈ పగటి కలలచిత్రాల్లో వాళ్ల జీవితం ఒకరకమైన మృత్యువు. ఆ సంగతి మనకు తెలుసు. మానవజాతి మరీవాస్తవాలను భరించలేదు అంతేకాదు, విపరీతమైన అవాస్తవికతనూ, అబద్ధాన్నీకూడా భరించలేదు.

మనల్నిగురించి మనం పూర్తిగా ఆలోచించం. మనం ఏమిటో తెలుసుకునేందుకు మనల్ని గురించి మనం తగినంతగా ఆలోచించం. మనమంతా కలిసి సాధించినవి మనల్ని మించిపోయాయి అందుకేమనం వాటిని చూపుకుని మనల్ని మనం సమర్థించుకుంటాము. జెట్‌విమానంలో నాలుగ్గంటల్లో అట్లాంటిక్‌ని దాటుతాము. అది మనగొప్పతనంగా చెప్పుకుంటాం. మన పెట్టుబడిదారీ వ్యవస్థ అంతం మనచేతుల్లోనే ఉందని వింటుంటాం కొన్ని సంవత్సరాల క్రితం సిరిల్ కన్నొల్లి వ్రాశాడు - మనం సంపూర్ణంగా మారబోతున్నామనీ అది పెట్టుబడిదారి వ్యవస్థ పతనం ద్వారానేకాదనీ, కార్ల్‌మార్క్స్‌కీ, సిగ్మండ్‌ఫ్రాయిండ్‌కీ అందని ఒకవాస్తవికమైనమార్పుద్వారా అదిజరగబోతున్నదనీ అందుకేమనం ఇంకా అల్పులంకావడానికి సిద్ధంకావాలి. దీన్ని మేధావిశ్లేషణ అనాలో లేక విశ్లేషణా పరమైన మేధస్సు అనాలో మరి! వినాశనాలు వినాశనాలే. ఎవరో రాజనీతిజ్ఞుడు అన్నట్టు వాటిని విజయాలు అని చెప్పుకోవడం భయకరమైన మూర్ఖత్వం అవుతుంది. నేను మీదృష్టికి తెచ్చేది మేధావివర్గంలోని వైఖర్లు. సంఘం, మానవస్వభావం, వర్గం, రాజకీయం, సెక్సు, మనస్సు, బాహ్యప్రపంచం, జీవపరిణామం మొదలైనవి గౌరవనీయమైనవి. కొద్దిమంది రచయితలు మాత్రమే ఈ విషయాలను పునఃపరిశీలించే యత్నం చేశారు. అలాంటివైఖరి జాయిస్, డి.హెచ్. లారెన్స్ వంటివారిలో మనకుగోచరిస్తాయి. అలాంటివారిని ఎవరూ సీరియస్‌గా ఛాలెంజ్ చేయరు. ఎంతమంది రచయితలు డి.హెచ్. లారెన్స్‌ని రెండోసారి చదివారు? సహజాతాలమీద పారిశ్రామిక సంస్కృతి ప్రభావాన్ని, సెక్సువల్ పొటెన్సీని గురించి వేరే దృక్కోణంతో లారెన్సునుగురించి ఎవరైనా చర్చించారా? ఒకశతాబ్దంగా సాహిత్యం అవే ఆలోచనల్ని, అవేగాధల్ని, అవే ఎత్తుగడల్ని ఉపయోగిస్తోంది. గతయాభై ఏళ్ళుగా వ్యాసకర్తలంతా వ్యాసం తరువాత వ్యాసం, పుస్తకం తరువాత పుస్తకంలో అవే లోతైన ఆలోచనల్ని సమర్థిస్తున్నారు. వారంతా బోదిలేర్, నీషే, మార్క్సు మనస్తత్వ విశ్లేషణలకు సంబంధించినవే వ్రాశారు. గ్రిల్లెట్ వ్యక్తిత్వాన్నిగురించి చెప్పిందే-ఈ ఆలోచనలకీ, సంఘానికీ, అమానుషీకరణకీ అన్నిటికీసరిపోతుంది. అవంటే మనం విసిగిపోయాం. అవి మనల్ని ప్రతిబింబించ లేవు. వాళ్ళు చెప్పినవీ, చిత్రించినవీ మనకు అనుగుణంగా లేవు. మనం అంతకన్నా విశదంగా చెప్పాం. బాగా చెప్పాం.

ప్రస్తుతం ప్రధానమైనది ఏమిటి? కళా, శాస్త్ర విజ్ఞానమూ కాదు. అర్థంకానితనంలో, అయోమయంలో, మానవజాతి మనం ఉంటామా లేక తుడిచిపెట్టబడతామా అనే సందిగ్ధంలో ఉంది. అన్ని జీవరాసులూ ఇందులో చిక్కుకున్నాయి ఇలాంటి పరిస్థితుల్లో, మనల్ని మనం

జ్ఞానవంతం చేసుకోవాలి. అన్ని అర్థం లేని పనుల్నీ అవతలకి నెట్టేయాలి మన నిర్ణయాలను, పనుల్ని కూడా ప్రక్కపెట్టేయాలి. కాన్రాడ్ మనలో వున్న ఆవరానికి చేసిన నివేదన వాస్తవమైనది. ఈ వ్యవస్థల మునకలో మనం బాధలుపడాలి. ఆ వ్యవస్థల ఓటమివల్ల సిద్ధాంతాలనుండి బయటపడే అదృష్టం కలుగుతుంది; తప్పుదోవపట్టించే అంతరాత్మనించి విముక్తి లభిస్తుంది. త్వరగా అలాంటి అభిప్రాయాలనించీ, జీవితాన్నించీ బయటపడాలి. కళ తీవ్రత నుండి విముక్తమైందని హెగెల్ అన్నాడు. ఉనికికోసం జరుగుతున్న సంఘర్షణలో ఆత్మను వాస్తవాలకు సంబంధించిన బాధాకరమైన సంకుచితాలనుండి విముక్తం చేసేవిధానం ప్రస్తుతం ఎక్కడాలేదు. ఏది ఏమైనప్పటికి ఈ సంఘర్షణలో ఉన్న వాళ్ళకి సంస్కారమూ, కళాజ్ఞానమూ లేదనలేము. మన కంఠాలు మనం ఎంత సంస్కారయుతంగా ఆలోచిస్తున్నామో తెలియజేస్తున్నాయి. మనం ఎంతో తెలుసుకున్నాం, అనుభూతిని పొందుతున్నాం, మనల్ని మెలితిప్పే ఈ సంఘర్షణ మనల్ని మనం పునర్నిర్వచించుకోవడానికి, మనలోని విషాదమైన బలహీనతని వొదుల్చుకోవడానికి ఉపయోగపడుతుంది.

రచయితలు గొప్పగా గౌరవింపబడుతున్నారు. తెలివైన ప్రజలు వాళ్ళను ఓర్పుగా చదువుతున్నారు; నిరాశతరువాత నిరాశను భరిస్తున్నారు. తత్వశాస్త్రంనించి, సాంఘికవాదనించి, శాస్త్రవిజ్ఞానంనించి, మతంనించి వినబడని వాణిని కళనించి విందామని నిరీక్షిస్తున్నారు. ఈ సంఘర్షణనించి బాధాకరమైన తపన - విశాలమూ, మార్చదగినదీ, నిండైనదీ, అర్థవంతమైనదీ అయిన తపన మానవులం అంటే ఏమిటి? మనం ఎవరం? జీవితానికి పరమార్థం ఏమిటి? అనే తపన మనలోకి వొచ్చింది. మానవజాతి సంఘటితమైన శక్తులతో తనస్వేచ్ఛకోసం ఘర్షణపడుతోంది. వ్యక్తి అమానవీకరణతో ఆత్మను సాధించుకోవడంకోసం సంఘర్షిస్తున్నాడు. రచయితలు ఈ ఘర్షణమధ్యను మళ్ళీరావాలి. అందుకు వారికి స్వేచ్ఛ ఉంది.

మన నిజమైనస్థితి, సంక్లిష్టత, అయోమయం, బాధలను కొంచెంకొంచెంగా ప్రౌస్ట్, టాల్స్టాయ్ ఆలోచించారు. ఈ స్థితి దాన్ని అదే వెలువరించుకుంటుంది; దాక్కుంటుంది. అదివెళ్ళిపోతే మళ్ళీ మనం సందిగ్ధంలో పడతాం కాని మనం అంతరాంతరాళాల్లో దాని చిహ్నాల్ని పోగొట్టుకోలేం. ప్రపంచంనించి మనం సంపాయించిన శక్తులు వచ్చిపోతూవుంటాయి. మనం ఈ విషయాన్ని మాట్లాడ్డానికి ఇష్టపడం. ఎందుకంటే మనం ఏదీ నిరూపించలేం. మన భాష అందుకు చాలదు. అందుచేతనే ఎవరూ దాన్నిగురించి మాట్లాడే ప్రయకత్నం చెయ్యరు. ఆత్మ ఉందని వాళ్ళుచెప్పక తప్పదు. అది మళ్ళీ మౌఢ్యం అవుతుంది. అందుచేతనే దాదాపు అందరూ దాన్ని గురించి నిశ్శబ్దంగా వుంటారు. అందరికీ ఆవిషయం తెలుసు.

సాహిత్యం యొక్క విలువ ఈ వాస్తవమైన అనుభూతుల్లోనే ఉంది. నవల వస్తువులు, కార్యాలు, దృశ్యాలు మొదలైన వాటితో నిండిన ప్రపంచంలో ముందుకూ వెనకకకూ కదులుతూవుంటుంది. వాటిలోంచే వాస్తవానుభూతులు వొస్తాయి. అవి చెడుకు వ్యతిరేకంగా మంచితో మనం కలిసివుండడంలో భ్రమ ఏమీ లేదని నమ్మకంకలిగిస్తాయి. నవలారచనలో చాలాసంవత్సరాలుగడిపినవాళ్ళు దీన్ని అంతగా పట్టించుకోరు. నవలను పురాణంతో పోల్చడానికి వీల్లేదు అలాగనిపద్యనాటకంతోనూపోల్చకూడదు. నవల కొన్ని వాస్తవానుభూతులు, అవాస్తవాలతో కూడిన జీవితాన్ని సమతౌల్యం చేస్తుంది నవల ప్రతిమనిషికీ, జీవితంలో తేడా వుంటుందనీ; దానికి కొంత ప్రత్యేకత, కొంత పరిపూర్ణత ఉంటుందనీ తెలియజేయడమేగాక దానికి కొంత అర్థాన్నీ, న్యాయాన్నీ, సమతౌల్యాన్నీ వాగ్దానం చేస్తుంది. కాన్రాడ్ చెప్పింది వాస్తవం - కళ ప్రపంచంలో పదార్థంలో జీవితవాస్తవాల్లో పునాదిగా, అత్యవసరంగా, అనంతంగా ఉండేదాన్ని గుర్తించేందుకు ప్రయత్నిస్తుంది.

# అవిశ్రాంత పథికులు

– డా. దేవరాజు మహారాజు

కొంతమంది కుర్రవాళ్ళు పుట్టుకతో వృద్ధులు - అన్నాడొక తెలుగు కవి. ఒకవైపు బాల్యం కుచించుకు పోతోంది. మరో వైపు వృద్ధాప్యాన్ని పట్టించుకునే నాధుడు లేడు - అని ఆవేదన వ్యక్తం చేశాడు ఇటీవల ఓ రచయిత. అయితే మరి వృద్ధాప్యంలో కూడా కుర్రవాళ్ళతో పోటీ పడుతున్న 'యువతీ యువకుల' మాటేమిటి? యవ్వన మంటే కేవలం శారీరక సంబంధమైన శక్తేనా? జీవిత చరమాంకంలో కూడా అలసిపోకుండా, ఓడిపోకుండా అచంచల ఆత్మ విశ్వాసంతో ముందుకు దూసుకుపోతున్న వృద్ధ యువకులలో నిక్షిప్తమైవున్న శక్తి ఎలాంటిది? దాన్ని ఎలా అంచనా వేయగలం? ప్రయత్నించి ఎవరికి వారు అర్థం చేసుకోవాలి తప్ప, ఇలాంటి కొన్ని ప్రశ్నలకు సూటిగా జవాబులు దొరకవు.

బాల్యం, యవ్వనం, వృద్ధాప్యం, మరణం అన్నీ ఒకదాని తర్వాత ఒకటి రైలు బోగీల్లాగా సాగిపోయే జీవక్రియలే. కాలంతో పాటు ఆదశల్ని దాటుకుంటూ పోవడం మామూలు మనుషులు చేసే పని. కొంత మంది గొప్పవాళ్ళకు ఇది వర్తించదు. ఎందుకంటే ఆకాశంలోకి దూసుకుపోయిన చిటారుకొమ్మలో ఆ చివరి ఆకు, తనకు సారాన్ని అందిస్తున్న వేళ్ళ ఉనికిని మరిచిపోదు. ఎంతటి ఉన్నత శిఖరాలధిరోహించినా ఎన్ని కీర్తి కిరీటాలు ధరించినా, మానవత్వపు మూల సూత్రాల్ని మరిచిపోక శ్రమైక జీవన సౌందర్యాన్ని ఆరాధించే వారు జీవితాన్ని ప్రేమించేవారు కొందరుంటారు. వయోభారం వల్ల వెన్నుపూస కృంగి పోవచ్చు. కంటి చూపు తగ్గి పోవచ్చు. పళ్ళు ఊడిపోవచ్చు. తల తెల్లబడి, అడుగు తడబడొచ్చు. స్పష్టంగా వినలేక పోవచ్చు. మాట అస్పష్టమైపోవచ్చు. అయినా, ఇటు కాలంతో అటు జీవితంతో పోరాడి పోరాడి రాటుతేలిన మహాయోధుల్లా కనిపిస్తారు. అదొక హుందా. అదొక అందం. దినమంతా ప్రచండమైన నిప్పులు కురిపించిన సూర్యుడటు కృంగి, సంధ్యాసమయాన ఎర్రని టమాటా కావడం ఎంత అందమైన అనుభూతి? చల్లని ఆకాశాన్ని రంగుల మయం చేసి ఎంతటి వింత శోభను కూరుస్తాడు? అది అతడి ఆత్మ స్థైర్యం. అది అతడి గుండె నిబ్బరం. అది అతడి సృజనాత్మకత. అది అతడి సంఘసేవా పరాయణత్వం. అదే అతడి సున్నితత్వం అదే అతడి పట్టుదల. జీవితాన్ని ఇతరులకు అంకితం చేసిన వారికి వృద్ధాప్యం ఉండదు. వారు నిత్యయవ్వనులు. జీవితమంతా తన గురించి తాను తాపత్రయపడే వాడు, పుట్టుకతోనే వృద్ధుడు. వాడికి ఏదశలోనూ యవ్వనం ప్రాప్తించదు. మనసును స్వచ్ఛంగా, నిశ్చలంగా, నిర్మలంగా వుంచుకోగల భావుకులకు, విశాలహృదయులకు వొంటి సరిహద్దులు, ఇంటి సరిహద్దులు ఎక్కడుంటాయి? ఆలోచనలు మైదానాల్లా విశాలమై పోతున్నప్పుడు శారీరక రుగ్మతలు కూడా తోకలు ముడుస్తాయో ఏమో. విజయాలు సాధించిన వృద్ధుల ముఖాల మీద ముడతలు - 'మెడల్స్' లాగా తళతళ లాడుతుంటాయి.

ప్రముఖ ఇండో - ఆంగ్లికన్ రచయిత కుష్వంత్ సింగ్ వయసు సుమారు 85. నవలా రచయితగా, కాలమిస్ట్‌గా, జర్నలిస్ట్‌గా అంతర్జాతీయంగా ప్రసిద్ధుడు. రచన విషయంలోనైనా, అలవాట్ల విషయంలోనైనా, ఆహార విషయంలోనైనా ఒక క్రమశిక్షణకు కట్టుబడి ఉంటాడు. తేలికపాటి యూరోపియన్ ఆహారాన్ని ఇష్టపడతాడు. వ్యాయామాలు, కసరత్తులు చేయరు. బుద్ధి జీవి గనక నలుగురికి ఉపయోగపడే పనుల్లో చురుకుగా పనిచేస్తారు. ఉదయం 5 నుండి సాయంత్రం 7 వరకు క్రమం తప్పకుండా రాయదలుచున్నదేదో రాస్తూనే ఉంటారు - 'ఇంకా ఏదో రాయాలన్న

తపన, తనను వూరికే కూర్చోనివ్వదని అదే తనకు కావల్సిన శక్తిని సమకూరుస్తుందనీ' అంటారు. నిద్రకు, విశ్రాంతికి తగినంత సమయం కేటాయిస్తారు. ఎంతటి ముఖ్యమైన అతిధులైనా సరే రాత్రి తొమ్మిది తర్వాత ఎవరినీ అనుమతివ్వరు.

కుష్వంత్ సింగ్ కన్నా మరో మూడేళ్ళు పెద్దవాడు హెచ్ డి. శౌరి (88). ప్రముఖ జర్నలిస్ట్ అరుణ్ శౌరికి తండ్రి. వినియోగదారుల ఫోరం నెలకొల్పి యేళ్ళకేళ్ళుగా ఒక క్రమశిక్షణ గల కార్యకర్తగా పనిచేస్తున్నారు. కోర్టులకు హాజరుకావడం, ప్రజల సమస్యలు తెలుసుకోవడం, వారికి తగిన సలహా లివ్వడం, ఇటు ప్రజలకు అటు సంస్థలకు ఒక వారధిలాగా పనిచేయడం ఆయన నిత్య కృత్యం. '' ఇంత ఉత్సాహం, ఇంత చురుకుదనం ఎక్కడిదీ?'' అని ఎవరైనా అడిగితే ''నలుగురికీ ఉపయోగ పడుతున్నాననే భావం, నా వల్ల సమాజానికి మేలు జరుగుతోందన్న ఆత్మవిశ్వాసం నన్ను ముందుకు నడిపిస్తోందని'' అంటాడు. ఈయనకు వృద్ధాప్యం గూర్చి ఆలోచించేందుకు సమయమే ఉండదు.

వందకు కేవలం రెండేళ్ళు మాత్రమే తక్కువగా వున్న బి.సి.సన్యాల్ (98) వ్యక్తిత్వం మరింత విశిష్టమైంది. ఈయన దేశం గర్వించదగ్గ గొప్ప శిల్పి. చిత్రకారుడు. ''నేనెప్పుడు నా సృజనాత్మక క్రియలలోనే నిరంతరం మునిగి ఉంటాను. అందులోనే నాకు ఆనందం ఉంది. అదే నన్ను నిలిపింది నా ఈ సుదీర్ఘ ప్రయాణానికి కనిపించని దివ్యశక్తి - సృజనాత్మకతే!'' అని చెప్పుకుంటారు. బక్కగా, నీరసంగా, అతిబల హీనంగా వుండే సన్యాల్ అనారోగ్యంతో చిననాడే కన్నుమూయాల్సింది. బాల్యంలో రోగిష్టి కుర్రాడిగా పెరిగాడు. ఇప్పటికీ అలాగే కనిపిస్తారు. ఆయన తీసుకునేది సాత్వికాహారం. పండ్లు ఫలాలు మాత్రమే. అప్పుడప్పుడు మాంసం తిన్నా జీర్ణం చేసుకోగలరు. ఆయన ఆహారం, ఆరోగ్యం చూసుకుంటున్నది ఆయన భార్యే! పెయింటింగ్ శిల్పాలు తప్ప ఆయనకు మరో ప్రపంచం లేదు. 'వయసనేది శారీరకమైనది కాదని అది మానసికమైనదని' అంటారు సన్యాల్. రోజుకు ఆయన పని చేస్తున్నన్ని గంటలు నేటి యువ చిత్రకారులు కూడా చేయలేరు. యోగా అప్పుడప్పుడు చేసినా, రోజూ వ్యాయామం మాత్రం చేయరు.

రౌనక్‌సింగ్ ఒకప్పుడు ఒక సాధారణ వ్యక్తి. అంచెలంచెలుగా కష్టపడి ఇప్పుడు రౌనక్ గ్రూపు కంపెనీల అధిపతి అయ్యారు. ఆయన వయసు డెబ్బయి. ఒకప్పుడు మంచి భోజన ప్రియుడు. మాంసాహారి. కాని ఇప్పుడు శాఖాహారిగా మారిపొయ్యారు. మితంగా తింటున్నా కంపెనీ గురించి అమితంగా ఆలోచిస్తున్నారు. కంపనీని విస్తృత పరిచే పథకాలు తయారుచేస్తున్నారు '' ఒకరికి ఉద్యోగమిస్తే, ఆ ఉద్యోగి కుటుంబంలోని ఆరుగురి ఆకలి సమస్య తీర్చినట్టేకదా?'' అని ప్రశ్నించే సింగ్ గొంతులో ఒక ధైర్యం, ఒక ఆత్మ విశ్వాసం, ఒక నిజాయితీ వినిపిస్తాయి

హైదరాబాదులో నారాయణగూడ బ్రిడ్జ్ మీద చెప్పులు కుట్టుకుని బతికే వీరయ్య వయసు డెబ్బయి అయిదు. అతడు ప్రముఖుడు కాదు. ఒక రోడ్డు ప్రమాదంలో కొడుకూ కోడలూ చనిపోతే పదిహేన్నేళ్ళ వయసులో వున్న మనుమల బాధ్యతను ధైర్యంగా మీదేసుకున్నాడు. వాళ్ళను చదివిస్తున్నాడు. సాయంత్రాల్లో వారికి చెప్పులు కుట్టేపని నేర్పిస్తున్నాడు. దురదృష్టం అతణ్ణి వంగబెట్టి పనిచేయిస్తోంది. అయినా అతను అలసిపోయినట్టు కనిపించడు. సరైన తిండి లేదు ఒంట్లో కావల్సిన శక్తిలేదు. క్రమబద్ధమైన జీవితం గడిపే అవకాశం లేదు. విశ్రాంతి అంటే దేనికీ? అని

ఎదురు ప్రశ్నిస్తాడు. ఆయనలోని శక్తి అంతా ముడతలు పడ్డ ముఖం మీది - చిరునవ్వే!

లైబ్రేరియన్ రాజుగా అందరికీ పరిచయమైన ఇందుకూరి సూర్యనారాయణ రాజు వయసు 64. ముప్పయ్యేళ్ళకు పైగా ప్రభుత్వ లైబ్రేరియన్‌గా పనిచేసి రిటైరయినా, ఆయనకు పుస్తకాల మీద మమకారం తగ్గలేదు ఈ సమాజాన్ని బాగుచేయాలన్న తపన తగ్గలేదు. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్యగారిపై గల గౌరవంతో హైదరాబాదులోని సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో గ్రంధాలయాధికారిగా చేరారు. ఒక ఐదేళ్ళలో ఆంధ్రదేశంలో చెప్పుకోదగ్గ గ్రంధాలయంగా దాన్ని తీర్చిదిద్దారు. పరిశోధకులందరికీ ఆయనో కల్పతరువు. ఎవరే పుస్తకం అడిగినా ఆయనో కుర్రవాడైపోయి, చిటికెలో వెతికి తెస్తాడు. పుస్తకాల గురించి తప్ప మరో విషయం ఆలోచించని ఈ లైబ్రేరియన్ గిరికి వ్యక్తిగతంగా, కుటుంబపరంగా, ఆరోగ్యపరంగా, వయసు పరంగా సమస్య లేవీ లేవా? అంటే ఉన్నాయి. వాటిని ఆయన పరిష్కరించుకోవడం లేదా అంటే పరిష్కరించుకుంటున్నారు. కానయితే అక్కడే ఆగిపోలేదు. సమాజంపట్ల బాధ్యత గల పౌరుడిగా, యువతకు ఒక దారి చూయించే గ్రంధాలయాధికారిగా, పనిలోనే పరమానందం పొందే స్థితికి చేరుకున్నారు. ఆకు కూరలెక్కువగా తింటూ, ఉదయం పూట వాకింగ్ చేస్తూ సాదాసీదా జీవితం గడుపుతున్న ఈయనకు ఎక్కడ అన్యాయం జరిగిందని తెలిసినా యువకులకంటే ఎక్కువగా గుండె మండిపోతుంది.

తెలంగాణా సమరయోధులుగా, సాహితీ వేత్తలుగా తెలుగునాట దాశరధి సోదరులకు ఒక ప్రత్యేక స్థానం ఉంది. కవి దాశరధి జీవించిలేడు. నవలా రచయిత దాశరధి రంగాచార్య గారికి దాదాపుగా 70 వయసు. ఆయన ఆత్మకధ ''జీవన యానం'' ఒక గొప్ప యాత్రాస్మృతి ఒక గొప్ప పోరాటచరిత్ర. ఈ వయసులో అంతటి జ్ఞాపక శక్తితో ప్రామాణికంగా రచన చేయగలగడం అపూర్వమైన విషయం. రెండు రెక్కల్లా ఇద్దరు కొడుకులు ఎదిగొచ్చి, టక్కున తెగిపోయినా, ఆయన కుప్పకూలిపోలేదు. దారిద్ర్యం లోంచి, పోరాటంలోంచి, ఉద్యమాల్లోంచి సంఘర్షణల్లోంచి తన్నుకుని వచ్చిన విశిష్ట జీవితం ఆయనది. ఓటమిలేదు. అలసటలేదు. వేదాల అనువాదం ఒక బాధ్యతగా స్వీకరించారు. మెరిట్‌గల విద్యార్థులను, రచయిత దంపతులను సన్మానిస్తున్నారు. చిన్నగా, పీలగా, బలహీనంగా కనబడే ఆయనలో అంతటి శక్తి ఎక్కడిదీ? డాక్టరు సలహా మేరకు కొద్దిపాటి వాకింగ్, శ్రీమతి కమల ఆధ్వర్యంలో కొద్దిపాటి తేలిక ఆహారం వెరసి ఒక మధ్యతరగతి జీవితం గడుపుతున్న రంగాచార్య, జీవితంలో అంతటి మహోన్నత శిఖరాలెలా అధిరోహించగలిగారూ? అంటే ఆయన ఆత్మ విశ్వాసం, నిజాయితీ, ధైర్యం, నిరంతర పరిశ్రమే కారణం! ఆయనలోని చురుకుదనమే తప్ప, వృద్ధాప్యం ఎప్పుడూ మాట్లాడదు.

ఇలాంటి వ్యక్తుల గూర్చి ఇంకా చాలా చెప్పుకోవచ్చు. ఇంకా చాలా మంది గూర్చి కూడా చాలా చెప్పుకోవచ్చు. కాని, ఇవిచాలు! ఇవికొన్ని నమూనాలు మాత్రమే! వివిధ స్థాయిలకు, వివిధ రంగాలకు వివిధ ప్రాంతాలకు చెందిన ఎంతో మంది వయోధికుల జీవితాల్లో కొన్ని సారూప్యాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆ సారూప్యాలే - వారి జీవరహస్యాలవుతున్నాయి. ఆ రహస్యాలను అర్థం చేసుకోగలవారికి. అందులోంచి స్ఫూర్తిని పొందగలవారికి వార్ధక్యం లేదు. వారు కూడా అవిశ్రాంత పథికులుగా సాగిపోవచ్చు.

# నాటకకళ : ఆదర్శము

- బళ్ళారి రాఘవ

దేహమారోగ్యముగా లేనప్పుడు వైద్యుల సాయము కోరవలసి రావచ్చును. వైద్యులనేక విధములవారు ఒకరు కంటి డాక్టరు - ఒకరు పంటి డాక్టరు - ఒకరు మంటి డాక్టరు. ఇట్లే పెక్కురకములవారు గలరు. కంటి డాక్టరు యొద్దకు వెళ్ళిన అన్ని వ్యాధులకును సరియగు కంటి జోళ్ళు లేక పోవుటయే కారణమనియు, అద్దాలు మార్చిన యెడల రోగము కుదురుననియు జెప్పును పంటి డాక్టరు దగ్గరకు పోయిన పండ్లన్నియు పీకించువరకు దేహారోగ్యము కలుగదని చెప్పును. మంటి డాక్టరు యొద్దకుపోయిన ఒంటి కంతయు మట్టిని పట్టించుకొన్ననే తప్ప దేహము బాగుపడదని చెప్పును. ఇట్లే ఇతరులును. రాజకీయ వేత్తలనడిగిన రోగములకెల్ల దారిద్ర్యమే కారణము. దేశస్వాతంత్ర్యము లభించు వఱకు దారిద్ర్యము పోదు. ప్రజలకారోగ్యమురాదు అని నుడువుదురు. అట్లేనేనును జనులలో వ్యాపించి యుండు అజ్ఞాన రోగము మాయువరకు దేశము బాగుపడదనియు, ఆ యజ్ఞాన రోగము ఉత్తమ నాటక ప్రదర్శనము వలననే మాయుననియు చెప్పుదును. మంచి నాటక ప్రదర్శనములు ఉన్ననే తప్ప దేశములో విజ్ఞానాభివృద్ధి కాదనియు, విజ్ఞానాభివృద్ధి కాకపోవుటయే దేశ దౌర్బల్యమునకు హేతువనియు కావున నెట్లయిన నాటక కళ నభివృద్ధి గావించి దేశమునుద్ధరింపుడనియు ఇరువది యేండ్లుగా చెప్పుచున్నాను. ఇప్పటికీ చెప్పుచున్నాను

భరత శాస్త్రములో

నతత్ జ్ఞానం, నతచ్ఛిల్పం

నాసా విద్యా. నసా కలా

నాసౌ యోగః, నతత్కర్మః

నాట్యేస్మిన్‌యన్న - దృశ్యతే.

అని యున్నట్టు నా మిత్రులొకరు చెప్పిరి నా మతమునకిది చాల సహకారి. మూకపంచశతిలో

పరమాం కళాముపాసే

పరమశివ వామాంక పీఠికాసీనాం

అని వ్రాసియున్నారట. కావున కళ యనగా సాక్షాత్ శక్తి స్వరూపమని సూచితమగుచున్నది. అట్లే శ్రీమద్భాగవతములో - ద్వితీయ స్కంధమున బ్రహ్మ యిట్లనుచున్నాడట.

అస్మత్ ప్రసాద సుముఖః కలయా కలేశః

ఇక్ష్వాకువంశ అవతీర్య గురోర్ని దేశే

తిష్ఠన్ వనం సదయితా నుజమానివేశ

యస్మిన్ విరుధదశ కంధరః ఆర్తిమార్ఛత్

దీనికి శ్రీధర వ్యాఖ్యానములో కళ అనగా మాయ అని అర్థము చేయబడియున్నదట శైవాగమములో భగవంతుని స్వరూపము ''నాదబిందుకళ'' అని వర్ణింపబడి యున్నది. అందు

కళయనగా 'పరమాత్మని కదలిక' యని అర్థము చేసియున్నారట. ఆ కదలికయే శక్తి స్వరూప మనియు, ఆ మాయాశక్తి ఈశ్వరునితో చేరినప్పుడే సృష్టి యేర్పడుననియు భావము. కావున సృష్టికి కళయే మూలమని యేర్పడుటలేదా? ప్రపంచములోని అన్ని పోకడలకు మాయాశక్తియే కారణమై ఆ మాయాశక్తి విజృంభణమే శివ తాండవమనియు, తదుపరతియే శాంతమగు బ్రహ్మావస్థయనియు నేర్పడునేమో? మొత్తమున మాయా శక్తి స్వరూపమే కళయని అర్థమగుచున్నది.

అట్టి కళకు స్థానమెద్ది? అందు సౌందర్యమునకేమైనా ప్రాధాన్యముకలదా అను ప్రశ్న పుట్టును కదా? సామాన్య రీతిగా ఆలోచించి చూచిన యెడల సౌందర్యమునకు కళలో ముఖ్య స్థానమే యున్నదని తోపక పోదు. సుందర పదార్థములు మనసునాకర్షించును. ఈ యాకర్షణ శక్తి కళా సంపదలోని మహిమయా అనుపించును. అయిన ఒకరికి సుందరముగా తోచు వస్తువు మఱియొకరికి వికారముగా కనుపింపవచ్చును. ఒకరికింపైన గానము ఇంకొకరికి తలనొప్పి కలిగింపవచ్చును. మన దేశములోని స్త్రీల అలంకారములు చీనా దేశమువారికిని, నీగ్రోలకును, తుదకు పాశ్చాత్య దేశములకును అంగీకారము కాకపోవచ్చును. వారికి సౌందర్య స్థాయివేఱే. వారి గానము మనకు బోధపడదు. మనది వారికి రుచింపదు. ఆల్ డస్ హక్స్‌లీ అను పాశ్చాత్యుడు ''తాజ్‌మహలు''ను చూచి ఇట్టి వికారమగు కట్టడమును ప్రపంచములో నేనెచ్చటను చూడలేదనెనట. ఇట్లే ఒకరి నాకర్షించు వస్తువు మఱియొకరినాకర్షింపక పోవచ్చును. సాధారణముగా నదులు, సముద్రములు, పర్వతములు, అరణ్యములు, తోటలు ఇత్యాదులు జన సామాన్యమునకంతయు ఆనందదాయకములని భావించుచున్నాను. ఈ ప్రకృతి స్వరూప సౌందర్యమునే దేశపు కవులుగాని యించుమించు ఒకటే విధముగా వర్ణించి యున్నారు. కాని ప్రకృతి స్వరూపములో సౌందర్య సాకల్యమున్నదని చెప్పవచ్చునా? అరణ్యములో నివసించువారికి దాని సౌందర్యము హృదయాకర్షకమగునా? పర్వత వాసులకు వాని గాంభీర్యము తోఁచునా? పడవ నడపు వారికి నదుల రమణీయత స్ఫురించునా? ఇట్లు చూచిన యెడల పరిచయాధిక్యము వలన సౌందర్య దృష్టి తగ్గునేమోయని అనిపించుట లేదా?

దీనినంతయు పర్యాలోచించి చూచిన యెడల కళ యందలి అభిరుచి మానవుని విజ్ఞాన సంపదపై ఆధారపడి యుండునని తేలకపోదు. అందఱికిని సమన్వయ మగునట్లు ఒక్కటే సూత్రముగాని, ఒక్కటే ఆదర్శముగాని నిర్ణయించుట కష్టము. అయిన నింతమాత్రము గట్టిగా చెప్పవచ్చును. ఏమన విజ్ఞాన సంపద లేనిదే కళా సంపద కలుగదు కనుక నివి రెండును నొకదానిపై నొకటి ఆధారపడియున్నవని చెప్పక తప్పదు.

ఇది యింట్లుండ ఈ కళాసంపద - విజ్ఞానసంపద యెవరికో కొందఱికి కలిగిన చాలదా? పుష్కరాలలో స్నానము చేసి మోక్షము సంపాదించుకొన వచ్చిన జనసమూహమునకు కళాభ్యాసముతో నేమవసరము? అని తప్పక తోచును. శ్రీ ద్వారం వేంకటస్వామినాయుడుగారి వంటి వారు నలుగురున్న చాలదా? దేశములోని వారందఱును త్యాగయ్య గారి కీర్తనలను నేర్చుకొనవలెనా? అని అడుగవచ్చును. అలాగే నాటక రంగమునకు సమర్థులగు నలుగురు తారలు **(Stars)** ఉండిన చాలదా అందఱును రంగమెక్కి తైతక్కలాడుట యవసరమా అని తప్పక అడుగ వచ్చును. గొప్ప గొప్ప యంత్రశాలలు, విద్యాశాలలు, పారిశ్రామిక సంస్థలు, దేశభక్తులున్న

దేశ సౌభాగ్యాభివృద్ధి కాదాయని అడుగ వచ్చును ఇవన్నియు అడుగదగిన ప్రశ్నలే కాని వీనివలన దేశ సౌఖ్య సౌభాగ్యాభివృద్ధులు మాత్రము కలుగవచ్చునే కాని సంపూర్ణ స్వరాజ్యము లభింపదేమో అనియు, ఒకవేళ అది లభించినను దాని సుఖమును సాకల్యముగ తృప్తియే అనుభవించి ఆనందపడు మనస్తత్వము లేకపోవునేమో అనియు సందేహింప వలసి వచ్చుచున్నది మొట్టమొదట స్వాతంత్ర్యమును సంపాదించుటకు మనోబలమును, దాని ననుభవించుటకు మనో వికాసమును ఆవశ్యకములు స్వాతంత్ర్య సౌఖ్యము ఆర్థిక సంపదచే మాత్రము కలుగునా యను శంక తట్టకపోదు కోటీశ్వరుండైనను వానికి మనో వికాసము లేని యెడల తన సంపద యొక్క సౌఖ్యము ననుభవింపజాలడు అప్పుడు వానికి తన ధనముపై సంపూర్ణ స్వాతంత్ర్యము లేదని చెప్పినను తప్పుకాదు. అట్టి స్వాతంత్ర్యముపై వానికిచ్ఛలేనిదే వాడు సంపూర్ణ సుఖమును అనుభవింపజాలడు. స్వాతంత్ర్యేచ్ఛ అనగా ''అందఱి సొమ్ము నాకేరాని'' అనువాంఛ కాదు. మఱి యేమన హృదయము వికసించి ఆ సంపదలో అందఱికి హక్కు కలదను పరిశుద్ధ భావము కలుగుట అట్టి భావము ఆ ధనికునకు కలుగవలెనన్న వాడు నిష్కల్మషమగు విజ్ఞాన దృష్టి, కల్మష రహితమైన సౌందర్య పిపాస వలననే కలుగును. ఇది అతిశయోక్తి కాదు స్వార్థ పరత్వమనునది గొప్ప మాయ. ఆ మాయ మాసినగాని నిర్మలమగు విజ్ఞాన దృష్టి ఏర్పడదు. ఆ మాయ తనలోని భాగమై తనకు లోబడిన దానిగ చేసుకొని ఆనందించు సామర్థ్యము ఒక ఈశ్వరునికే కావున ప్రతి మానవుడును తాను ఈశ్వరుని అంశము అను భావమును సార్థకము చేసికొన వలెనన్న ఆ మాయను తనలోని దానిగ జేసికొని దానితో నానంద మనుభవింప ప్రయత్నింప వలెను. పూర్ణమగు ఈశ్వరత్వము కళా సాంగత్యములేనిదే కలుగదు. కనుక నిజమగు దేశ సౌభాగ్యము కళా సంపద పైననే ఆధారపడి యున్నదని చెప్పవలసి వచ్చునుగదా. ఇంక అట్టి కళా సంపదను బడయుటకు మనమేమి చేయుచున్నాము? ఇప్పుడు సరియైన కళోపాసన జరుగుచున్నదా? కళాభ్యాసము వలన అందును ముఖ్యముగ నాటక కళ వలన దేశమునకు లాభము కలుగునా? కలుగ జేయవచ్చునా అను విషయముల నించుక పరిశీలింతము.

ప్రస్తుతము నటులలో కొందఱు తమ అంగసౌష్టవమును ప్రదర్శించుటకును, మఱి కొందరు తమ గాన సంపదను వెల్లడించుటకును, మఱి కొందరు ద్రవ్యార్జన కొఱకును, ఇంకను కొందరు వార్‌ఫండ్ నాటకములు వేసి పెద్ద పెద్ద ఉద్యోగుల దయ సంపాదించుట కొఱకును రంగస్థలము నాశ్రయించు చున్నారే కాని, దేశ విజ్ఞాన సంపదను హెచ్చించుట కంతగా పాటుపడుచుండుట లేదని చెప్పుటకు చాల సంకోచించు చున్నాను. మఱి కొందరు రంగస్థలము మీద ఇష్టము వచ్చినట్లు మాటలాడ వచ్చును. ఇష్టము వచ్చినట్లెగురులాడవచ్చును అను అభిప్రాయము కలవారుగా నున్నారు ఇప్పటి దేశ స్థితిని పరికించి చూచితిమేని జన సామాన్యమునందంతటను ఒక గొప్ప వ్యాధి వ్యాపించినట్లు పొడకట్టుచున్నది. అది ప్లేగు జాడ్యమున కంటెను తీక్షణమైనదనవచ్చును ఈ వ్యాధివలన బొత్తిగా సాంఘికబలమే తగ్గిపోవుచున్నది ఈ వ్యాధికి ముఖ్యకారణములు రెండు పురుగులు. ఒకటి అహంకారము, ఇంకొకటి అసూయ. ఇవి దినదిన ప్రవర్ధమానములగుచు సాగియున్నవి. మతగురువులు కొందఱు, ఆచార దోషముల నిరూపించుట యందును, నరక మార్గమున విద్యుద్దీపముల స్థాపించుట యందును హెచ్చు తక్కువల నిరూపించి సంఘమున వైమనస్యము - చీలికలు కలిగించుట యందు దక్షత వహించిరి. వకీళ్లలో కొందఱు లేని వ్యాజ్యముల కల్పించుటయందు దక్షులు. వర్తకులలో కొందఱుకి ద్రవ్యార్జనయే జీవితాదర్శము

పండితులు తమ పాండిత్య ప్రకటనలో విజృంభించు వారు కొందఱు, కవులలో వట్టి వర్ణనల యందాసక్తి చూపువారు కొందఱు. ఇంక జన సామాన్యమన్నచో కాల పరిస్థితులఁబట్టి యెందును, నుత్సాహము లేనివారుగా నున్నారు. స్థితిగతులట్లున్నను కొందఱు పెద్దలకు మాత్రము దేశములోని బానిస తనమునకు కారణముల గుర్తించి స్వాతంత్ర్య సంపాదనకై, చక్కని మార్గములు నరయుట తప్పనిసరిగా యేర్పడినది. ఇట్టి సందర్భములలో జనుల యందైకమత్యము కలిగించి వారి మనో బలము హెచ్చించి, విజ్ఞాన దృష్టి నలవఱచి, హృదయ వైశాల్యము పెంపొందింప వలయును. ప్రతి మానవుని యందును నూతన భావములంకురించి విజృంభించిన కదా దేశమునకు నిజమైన సౌభాగ్యము కలుగును. ఇదియొక గొప్ప విద్యాభ్యాసము. కేవలము యిప్పటి పరీక్షల యందు ఉత్తీర్ణులగుట వలన నీ శక్తి అంకురింప జాలదు. అయిన నిట్టిశక్తి నాటకముల మూలమున గలిగింప వచ్చునా అని నేనాలోచించుచున్నాను. కళా సంపదనుండి సృష్టి శక్తిని ప్రజ్వరిల్ల జేయవచ్చునా యని ఆలోచించుచున్నాను. అందులకే నేను తొలుత చెప్పినది.

నతత్ జ్ఞానం, నతచ్ఛ్రితల్పం
నా సౌవిద్యా, నసా కలాః
నా సౌ యోగః, నతత్కర్మః
నాటకే యన్న దృశ్యతే

అని మఱియొక మాట. ఈ విజ్ఞానదృష్టి ప్రసారమునకు అహంకారము కేవలమంత రాయముగ నిల్చును. నాటక కర్తలు గాని, నటులు కాని అహంకార పూరితులై యున్నయెడల విజ్ఞాన దృష్టికి కంటిపొర ఆవరించును. కొన్ని దినముల క్రిందట ఆలిండియా రేడియో వారు ''అహం భావములేని అభినయము కలదా?'' అను విషయముపై నన్ను మాటలాడుమనిరి. ఇందువలన నేమర్థమగు చున్నది? వారికెట్లు తోచియుండునని తెలియ వచ్చుచున్నది. అది అట్లుండనిండు.

అభినయ పదమునకు అర్థమేమి? శ్రీ నందికేశ్వర ప్రోక్తమగు అభినయ దర్పణములో నటుడెట్టి వాడని వర్ణించు సందర్భమున కృతిః = పండితుడు గాను, ప్రతిభానవాన్ = కల్పనా శక్తిగలవాఁడుగాను నుండవలయునని చెప్పబడి యున్నది. అభినయమను పదములో 'అభి' అనునది ఉపసర్గము, 'నంగ్' అనునది ధాతువు. ఈ ధాతువునకు 'నడపించుట' అను అర్థమేర్పడును. కనుక నటకుని ఆదర్శము తాను వ్యాఖ్యానకర్తగాను, ఉపదేశాధికారము కలవాడుగాను ఉండి వ్యక్తులకు తెలివి తేటలు కలిగించి సంఘమును నడిపించు వాడుగా నుండవలెనని ఏర్పడగలదు. అట్టి పదవిని సంపాదించు కొన్న నటునకు అహంభావము బొత్తిగా లేకుండుట కష్టము. కాని ఆ యహంభావము దురహంభావము మాత్రము కాగూడదు.

వేదాంతులు మాయను రెండు విధములని వర్ణించి యున్నారు. ఒకటి అవిద్య అని - ఒకటి కళయని. తామసగుణ ప్రధానమైన మాయ అవిద్య, సత్త్వగుణ ప్రధానమైన మాయ కళ. కావున కళోపాసకుడు అవిద్యారూపమగు అహంకారము నవలంబింపరాదు. మఱియు విద్యా విద్యల నిర్ణయించునట్టి జ్ఞానమావశ్యకము ఇందువలననెట్టి విజ్ఞాన దృష్టి నటకునకావస్యకమో యించుక అర్థము చేసికొన వచ్చును. నాటకము - అభినయము - ఈ రెంటికిని భార్యాభర్తల సంబంధము.

భార్యా భర్తల ఆదర్శ మొక్కటిగానే యుండి సదుద్దేశములు కలిగి సాగించిననే గాని సంసార యాత్ర చక్కగా సాగదు. నాటక కర్త యుద్దేశమును నటుని యుద్దేశమును సాధారణముగా జనసామాన్యమునకు ప్రబోధము కలిగింపవలయు ననియే యుండవలెను. వారిరువురి ఆదర్శములు వేఱైన యెడల గమ్యస్థానము దూరమగును. కావున నాటకము వ్రాయుటెంత గొప్ప పనియో, నటుడెంత విజ్ఞానవంతుడు కావలయునో మీరే యూహించుకొన వచ్చును. ఒక ఆంగ్లేయ గ్రంథకారుఁడు రెండువందల కవులలో నొక్కఁడు మాత్రమే నాటక కర్త లభించునేమో అనుచున్నాడు. కావ్యము పుష్పహారమట. నాటకము జడకు పుష్పములల్లుటయట. కావ్యము స్వేచ్ఛగా దిరుగు విమాన యానమట. నాటకము తూగుటుయ్యాల మాత్రమేయట. కావ్యము సముద్రములోని యీఁతయట-నాటకము మడుగులోని యీఁతయట. రెండవదానిలో స్వేచ్ఛా ప్రవృత్తి అరికట్టబడి యెన్ని నిర్బంధములకు లోబడ వలసి వచ్చునో యిందువలన వ్యక్తమగుచున్నది. మొత్తముపై చెప్పవచ్చినదేమన నాటకము వినో దాడంబరములకా, సంఘసేవకా నిర్ణయించు కొనవలెను. ''యరలవ మదనసయనుచున్'' అని వ్రాయగల కవులందరును నాటక కర్తలు కాజాలరు. రైల్వేస్టేషన్ ప్లాటుఫారంలో విక్రయింపబడు నాటకములు చదివిన ఒకవిధమగు వేదన కలుగుచున్నది. కొన్ని నాటకములు నటుల కొఱకు వ్రాయబడు చున్ననట. కొందఱు నటులు తమ భాగమును మాత్రము హెచ్చుగ వ్రాయించుకొని తక్కిన భాగముల తక్కువ వ్రాయింతురట. వారు నటులా? ఇవి నాటకములా? ఇక సినిమాల కొఱకు వ్రాయబడు కథలలో ముక్కాలు మువ్వీసములు అద్భుతములుగా నుండును వానిని వర్ణించు యోగ్యత నాకు జాలదు, క్షమింతురుగాక. ఈ సందర్భములన్నింటికి చక్కగా యోచించిన యెడల మన నాటకములలో పెక్కులును, మన నటులలో పెక్కురును ద్రవ్యార్జన కొఱకును, ప్రకటన **(advertisement)** కొఱకును బ్రతికి యుండుటయే గాని సమాజోద్ధారణమునకు కాదని నుడువుట సత్యమునకు దూరము కాజాలదు. దేశ సౌభాగ్యాభివృద్ధికిని, సంఘోద్ధరణమునకును అక్కఱకు రాని నాటకములును, నటులును అక్కఱకు రాని పదార్థములే. కావున నీ చర్చ వలన నేమేర్పడు చున్నది? దేశాభివృద్ధికిని - విజ్ఞానాభివృద్ధికిని, తోడుపడునే సంస్థలకును, నే వ్యక్తులకును నాటక సంఘములును - నటులును తక్కువవారు కారని. నా అభిప్రాయమేమన గొప్ప గొప్ప దేశనాయకులతోడను, గొప్ప గొప్ప పారిశ్రామిక చక్రవర్తులతోను, గొప్ప గొప్ప సంఘ సంస్కర్తలతోను, ఇట్టి వారింకెవ్వరితోను నటులను సమాన ప్రవత్తి గలిగి సమానగౌరవాదరములకు పాత్రులై తలలెత్తుకొని తిరుగవలయును. దేశసేవలో నితరులెవ్వరికిని వీరు తీసిపోవువారు కారను ప్రతిష్ఠ సంపాదించుకొనుటావశ్యకము. దేశసేవకులలో నటాగ్రేసరుడును నటీమణియు నుచిత స్థానముల నాక్రమించి నిక్కముగు తారలై మెలంగ వలయునని నా ఆశయము. అయిన న్యాయవాదులలోను, వర్తకులలోను, వైద్యులలోను, దేశ సేవకులనిపించు కొనవారిలోను స్వార్థపరులు లేరా? పొట్టపోసికొను వారు పాటు పడుటలేదా? పాపమీ నటుల పైననే యింత జవాబుదారీ మోపెట్టి యింత యుపన్యాసము చేయుటెందులకని కొందఱడుగ వచ్చును. ఇదంతయు సత్యమే! వారిలో నెందరో అట్టివారున్నారు. కాని కొందఱైనను వారిలో నిక్కముగ దేశసేవ కుపకరించు మహానుభావులున్నారు. అట్లే నటులలోను నట్టి మహానుభావులు కొందఱైన నున్నారని తెలిసిన అప్పుడు నాకంటెను సంతోషించు వారెవ్వరు నుండుబోరు.

ఇదియును గాక నాటకముల యుద్దేశమేమి; నటకుల ఆదర్శమేమి? విజ్ఞాన ప్రపంచమున వీరికెట్టి స్థానమున్నది? అను విషయముల గూర్చి సూచించియున్నాను. ఆ సూచన మేరకు నాటక

కర్తలును, నటులును సరియైన మార్గమున నడవగలిగిరేని వీరివలన కలిగినంత లాభము సంఘోత్తే జనమునకు మఱి యేయితరుల మూలమునను కలుగఁజాలదని చెప్పుటకే మాత్రమును జంకను. మహాత్ముని సామాన్య జనాభివృద్ధి ప్రణాళికకును, శ్రీనివాసశాస్త్రిగారి విద్యాభివృద్ధి ప్రణాళికకును, హిందూదేశ సేవాసంఘము వారి ప్రణాళికకును, నవ్య సాహిత్య పరిషత్తువారి ప్రణాళికకును, నాటకకర్తలును, నటులును ఎక్కువ సాయము చేయగలుగుదురని నాకు త్రిప్పరాని నమ్మకము కాని యిక నిట్టి గొప్పకార్యమునకు తోడ్పడగల నాటకముల వ్రాయుటకుగాని వానిని ప్రదర్శించుటకుగాని యిప్పుడు మన దేశమున నెట్టి సాధన సంపత్తి కలదో యించుక అరయుదము.

విద్య నేర్పుటకు విద్యాశాలలు గలవు. ఇంచుమించు ప్రతి గ్రామములోను ప్రాథమిక పాఠశాలలున్నవి. రోగుల కొఱకు వైద్యశాలలున్నవి. సంగీతము, చిత్రకళ నేర్పుటకు శాలలున్నవి. వైదిక విద్య నేర్చుకొనుటకు సంస్కృత పాఠశాలలున్నవి. సేద్యము నేర్చుకొనుటకు వ్యావసాయిక పాఠశాలలున్నవి. పారిశ్రామిక విద్య - ఆరోగ్య విద్యనేర్పు శాలలున్నవి. పోలీసులకు శాలలున్నవి. రైల్వే వర్కు షాపులున్నవి. ఇంతేల ప్రపంచములోని యించుగ నెల్ల విద్యలనేర్చుకొనుటకు తగు నేర్పాటులున్నవి కాని నాటక విద్య నేర్పుటకేమైన కలదా? ఇతరములతో బాటు నాటక కళయు ముఖ్యమే గదా? ఇదేమి పాపము చేసినది? నాటకము కేవలము వినోదమునకేనా? సహజ సామర్థ్యమున్న వారొకరిద్దఱున్న చాలునా? ఈ ప్రశ్నలన్నియు మీరు శ్రద్ధయై - నిదానముగా నాలోచించుకొనవలయును. లోపములున్న, వాని పరిహారమునకై మార్గములు వెదకవలయును. దేశములోని కాఫీ క్లబ్బులకును, సినిమాలకును నెంతడబ్బు వ్యయమగుచున్నదో అంత డబ్బు నాటక ప్రదర్శనములకును వ్యయమగుచున్నది. కాఫీక్లబ్బుల యుద్దేశము ఆహారము నొసగుటయే, సినిమాల యుద్దేశము వినోదమునకే అని అనుకొన్నాను. నేను చూచిన తెలుగు చిత్రములలో నొక్కదాని యందైననూ ఇతరోద్దేశమున్నట్లు నాకు కన్పింపలేదు. కొలది దినముల క్రిందట 'భీష్మ ప్రతిజ్ఞ' అను చిత్రము చూచితిని. అందు మిక్కిలి జనరంజకముగా నున్న దృశ్యము త్రాగుడుపైనను, స్త్రీల అంగ సౌష్ఠవ ప్రదర్శనము పైనను ఆధారపడినవి. భీష్ముని బ్రహ్మచర్యమున కాదృశ్యము విరుగుడుగా అమర్పబడి యుండనోపునా అని సందేహించితిని. ఇంకొక చిత్రములో ఒక స్త్రీ రత్నము ఒక కుష్ఠురోగికి భార్యయైనను తన పాతివ్రత్య మాహాత్మ్యమున సూర్యచంద్రులు గతుల నడ్డగించి పంచభూతముల అల్లకల్లోలము గావించెను. త్రిమూర్తులే ఆమెకు శరణాగతులైరి. ప్రపంచ రక్షణమునకై ఆమెను మొఱబెట్టుకొనిరి. ఇట్టి అద్భుత శక్తిగల తరుణి తన మగని కుష్ఠురోగము నేలమాన్పక పోయెనోయని ప్రక్కనున్న నామిత్రునడిగితిని. అతడు తన మగని వ్యాధిని మాన్పిననతడు మరల వేశ్యాగృహమునకు పోవునేమోయను భయ మామెను బాధించి యుండవచ్చుననెను. ఇట్లే యెన్నియో సన్నివేశముల జనులకు నవ్వు పుట్టించు సందర్భములే యుండును నాటకములకు గూడా నిట్టి ఆదర్శములేనా? వాని యుద్దేశము కేవలము గిలిగింతలు పెట్టుటకేనా? ఆలోచింపుడు. అభినయ కౌశల్యము గూర్చి యొక ఆంగ్లేయ గ్రంథకర్త యిట్లు వ్రాసినాడు; ''అంగ సౌష్టవము కళా కౌశలము కాదు. వాచక సామర్థ్యము కళా కౌశలము కాదు. సగర్వముగా నడుచుట కళా కౌశలము కాదు. కాలు చేతులు త్రిప్పుట కళా కౌశలము కాదు. ముఖముద్రను మార్చుట కళా కౌశలము కాదు విశాల నేత్రములు కలిగి వాని నిటునటు త్రిప్పుట కళా కౌశలము కాదు. అయిన నింకేది కళా కౌశలము? నటకుని మనస్సును ప్రేక్షకుల మనస్సులను కట్టివేసి ఏకమొనర్చు గొప్ప శక్తియే అభినయ కళాకౌశలమని'' నుడివి యున్నాడు. ఇక నాటక

కర్తను గూర్చి 'ముద్రారాక్షసము'లో నిట్లున్నది అమాత్య రాక్షసుడు తన స్వగతమున నిట్లనుకొనుచున్నాడు

★ కార్యోపక్షేపమాదౌ, తనుమపిరచయన్
తస్యవిస్తారమిచ్ఛన్
బీజానాంగర్భితానాం, ఫలమతి గహనం, గూఢ
ముద్భేదయంశ్చ
కుర్వన్ బుద్ధ్యావిమర్శం, ప్రసృతిమపి పునః
సంహరన్ కార్యజాతం
కర్తావా నాటకా నామిమమను భవతి క్లేశ
మస్మద్విధోవా

పేరునకై రాజ్యమేలు రాజునట్లుంచి ప్రజాపాలన సూత్రములన్నిటిని తన చేతబూని రాజ్యక్రమమునే ఒడుదుడుకులు లేక త్రిప్పవలసిన మంత్రికి ఎట్టెట్టి ఆలోచనలు, క్లేశములు, ఎట్టి ప్రయత్నములు, ఎట్టెట్టి యుపసంహరణ కార్య క్రమములు - దీక్షలు నుండవలయునో అట్టివన్నియు నాటక కర్తకు నుండవలయుననిన ఆ జవాబుదారి యెంత గొప్పయో ఊహింప సాధ్యమగునేమో కాని వర్ణింప వలనుపడదు.

ఇంతటి సామర్థ్యము గల నాటక కర్త రచించిన నాటకము గొప్ప ప్రజ్ఞావంతుడగు నటుడు ప్రదర్శింప వలయునే కాని అన్యులు ప్రదర్శించినది కేవలము మొహరం పండుగలోని దృశ్యముగ పరిణమించునే కాని నాటక ప్రదర్శనము కానేరదు. (దేశమందెల్ల దారిద్ర్యదేవత తాండవ మాడుచుండ మొహరం పండుగ దృశ్యముల వంటి నాటకములకు అంతలంతలు ద్రవ్యము వ్యయపఱచుట యుక్తమగునా? ఆలోచింపుడు.) ఇంతకును జనసామాన్యమునకు చక్కని నాటక కళను అర్థము చేసుకొనుశక్తి యుండినగాని దేశ విజ్ఞానము పెంపొందదు. మంచి సంగీత గానివలె తమకు పాడుటకు శక్తిలేకున్న పోయె గాని అతని పాట యందలి మాధుర్యము ననుభవించి ఆనందించు శక్తియైనను శ్రోతలకుండవలెను. దీనికి కళాభ్యాసమావశ్యకము. కళోపాసన మత్యావశ్యకము. కాని సాధనసంపత్తి యేదీ? వర్తమాన కాలమున నటుడొక్కడే యెట్టి పూర్వాభ్యాసము లేకయే రంగస్థలమునకెక్కుచున్నాడు. పదునైదు రూపాయల గుమాస్తా కావలెనన్న సర్టిఫికెటు, డిప్లొమా, సిఫారసు పత్రములు, పబ్లిక్ సర్వీస్ కమిషన్ మన్నగునవి కావలయును. నటున కట్లు కాదు. ఇంచుక అంగ సౌష్టవము, వంకరలు తిరిగిన కురచ జుట్టు - కొంచెము కంఠ స్వారస్యము గలిగిన చాలును. వానికి శతమానమునుండి వేతనము. నేనెఱిగిన ఒకానొక నటుడు ''పతిత పోషకుడెవర'' ని అడిగెను. సినిమా మ్యానేజరని చెప్పితిని. ఎందరు సినిమా తారలకు చదువుట, చదివిన దానిని అర్థము చేసికొనుట వచ్చునో పరీక్షింపుడు. ఇట్లున్నను అట్టివారికి వేలకొలదిగ జీతములిచ్చి భరించు సినిమా యజమానులే పతితోద్ధారకులనుటలో తప్పేమి కలదు? నాటక కళను ఉన్నతస్థితికి తెచ్చి దేశసేవ కుపకరించునట్లు చేయుట మనసంఘ నాయకుల ధర్మముకాదా? కేవల ముపన్యాసముల మాత్రమిచ్చుచు రాజకీయావరణములో సంచరించుచుండిన

చాలునా? దేశమున కళాభివృద్ధి యెట్లు కావలెను? అట్లు కాకున్న దేశమునకు సంపూర్ణ స్వాతంత్ర్యము దొరకునా - దాని పూర్ణానుభూతి మనకు లభించునా? యోచింపుడు. ఎంత రోదనము చేసి యేమి ప్రయోజనము? నాటక కళను కేవలము ఏదో యొక విధమగు స్వార్థమునకై ఉపయోగించువారును, వారినే ప్రోత్సహించువారును నుండునంత వఱకింతే.

ఈ దుస్థితికి కారణములు పెక్కులు గలవు. మొదటిది సరియైన నాటక భవనము లేకుండుట. ఎచ్చట చూచినను సినిమా శాలలు. వాని యజమానుల కొక్కొక్క నాటక ప్రదర్శనమునకు కనీసము నూరు రూపాయలైన బాడుగయియ్యవలెను. రెండవ కారణము నాటక కళాభ్యాసన పాఠశాలలు లేకుండుట. ప్రభుత్వమువారు గాని, యూనివర్సిటీవారు గాని, యీ విషయము నేమాత్రము తమ చెవిని వేసికొనరు. వారికి తగినంత యొత్తిడియు లేదు లోకల్ బోర్డువారన్న స్వయూధ కలహములకే వారికి కేవలము చాలదు  ఇంక నాటకము కడ తిరిగి చూడ తీరిక యేదీ? జనసామాన్యమన్న వినోద పిపాసువులై పోయిరి. మొన్న మొన్ననే స్త్రీలు స్త్రీ పాత్రముల ధరింపవలెనను భావము వ్యాపించెను. దాని చక్కని ఉపయోగము సినిమాల పాలయ్యెను. నాటక రంగమున కక్కరవచ్చు స్త్రీలు చాల తక్కువ. సినిమావారి నైజవృత్తివేరు. వారి కాదర్శము ద్రవ్యార్జనము. ఈ నవీన వృత్తిలో కూడ ద్రవ్యము సంపాదించుటయే వారిధ్యేయము  ఎవరైన ఒక్క ప్రదర్శనంలో నించుక మెప్పువడసిరా యింక వారిని పట్ట పగ్గములు లేవు. వారి కృపా కటాక్షము బడయుటకు వేలకొలదిగ జీతములు వారి పాదసన్నిధి నర్పించుటకు వర్తక దృష్టిగల కంపెనీలు వందల కొలది సిద్ధముగా నుండును. ఇప్పుడున్నవి కాక క్రొత్త వేర్పడుచున్నవి. ఇఁక కొంచెము విమర్శకుల కడ చూపు త్రిప్పిన అదేలకో ''తామెచ్చినదే రంభ'' అను సూత్రము వారి గాయత్రీ జపము. తమకు ఎట్లో కావలసిన వారిని పొగడుట, ఏటికో కాబట్టని వారిని తెగడుట వారి జన్మోద్దేశ్యముగ నేర్పడి పోయినది. ఒక గొప్ప అమెరికా దేశపు విద్వాంసుడు ఇట్లనుచున్నాడు.

**Inexperienced art critics should be called critikins. Their writings tend to denationalize art, poetry and music.**

ఇది యెంతయు యదార్థము. ద్రవ్యకాంక్ష గల ప్రదర్శన కర్తలు, కళపై దృష్టిలేని నటులు, స్వార్థపరులగు విమర్శకులు, ఏకమై యీ దేశములోని కళా ప్రభావమును మాయచేయుచున్నారు దేశములోని బానిసత్వపు శృంఖలములను త్రెంచి తెగటార్చుటకై యెట్లు పాటుపడుచున్నామో అట్లే కళా సంపదను అణగ ద్రొక్కిన అవిద్యను కూడ లయమొనర్ప పాటుపడి శంకరుని తాండవ మందలి అంతరార్థ జ్ఞానమును సంపాదింపవలెనను ఆశ నాకు కలదు. అది నటుడగు ఆ పరమేశ్వరుని కరుణచే నటశిరోమణుల సంఖ్య వృద్ధియై దేశ స్వాతంత్ర్య సౌభాగ్యమునకు నాటక కళ అత్యంతము తోడ్పడు గాక యని ప్రార్థించుచున్నాను.

(ఏప్రిల్ 16, విశ్వవిఖ్యాత నటులు బళ్ళారి రాఘవ 52వ వర్థంతి సందర్భంగా)

''నాట్యకళ - జులై - ఆగష్టు - 1971'' సంచిక నుండి

# సాహిత్య సేవలో ప్రచురణరంగ త్రిమూర్తులు

- మువ్వల సుబ్బరామయ్య

తెలుగు పుస్తక ప్రచురణ రంగంలో మార్గదర్శకులు వావిళ్ళవారు, మానవల్లివారు. ఇతరులు వ్రాసిన రచనలను ప్రచురించి దేశసేవను ఘనంగా చేయవచ్చుని నిరూపించిన వారు శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు, శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర శాస్త్రులు, శ్రీ మానవల్లి రామకృష్ణ కవిగారు మొదలైనవారు. సారస్వత సేవయే వారి ఆశయంగా ఆంధ్రులకు జ్ఞానదానం చేశారు.

## శ్రీ వావిళ్ళ రామస్వామి శాస్త్రులు (1826–1891)

తెలుగు పుస్తక ప్రచురణ రంగంలో ఆద్యులు, ప్రసిద్ధ పండితులుగా విఖ్యాతి గాంచిన వావిళ్ళ రామస్వామి శాస్త్రులు ఆంధ్ర, తమిళ, కన్నడ, సంస్కృత భాషలలో గ్రంధాలను ప్రచురించి వాఙ్మయ సేవ చేసిన ధన్యజీవులు. సి.పి.బ్రౌన్ గ్రంధసేకరణ, పరిష్కరణల ద్వారా లభించిన శ్రమ ఫలితాన్ని పుస్తక రూపంలో పెట్టిన తెలుగు ప్రచురణ కర్తలలో అగ్రగణ్యులు వావిళ్ళవారు.

వావిళ్ళ రామస్వామి శాస్త్రులు నెల్లూరు జిల్లా కోవూరు తాలూకాలోని వావిళ్ళలో 1826లో జన్మించారు. తండ్రి వేంకటేశ్వరశాస్త్రి, తల్లి మంగమ్మ. వీరికి నలుగురు కుమారులు, ఒక కుమార్తె వారందరిలో చిన్నవారు రామస్వామి శాస్త్రిగారు. పండితులైన తండ్రిగారి దగ్గరే విద్యాభ్యాసం సాగింది. సోదరుడు అనంత నారాయణ శాస్త్రి, రామస్వామి శాస్త్రి నెల్లూరులో గట్టుపల్లి శాస్త్రులు దగ్గర వేదాధ్యయనం, ద్రాక్షారామంలో పాపయ్య శాస్త్రి గారి దగ్గర వ్యాకరణం అధ్యయనం చేసి, చెన్నపట్నంలో తంజావూరు రామానాయని వారి సంస్కృత వేద పాఠశాలలో కొంత కాలం ఉపాధ్యాయులుగా పనిచేశారు. తరువాత మైసూరు మహారాజు ముమ్మడి కృష్ణరాయల ఆశ్రయం సంపాదించి, కన్నడం నేర్చుకున్నారు. మిత్రుల ప్రోత్సాహంతో ముద్రణాలయం పెట్టి కన్నడంలో రామాయణ, భారతాలను ముద్రించారు. ఆ ప్రయత్నంలో నిరుత్సాహం ఎదురైంది. మహారాజాగారి వేద సంస్కృత పాఠశాలలో అధ్యాపకులుగా కొంత కాలం పనిచేశారు

శ్రీ శృంగేరి పీఠాధిపతులు వావిళ్ళ సోదరుల విద్యా విశేషములకు సంతోషించి మూడు వందల రూపాయల సంభావన అందజేసి, చెన్నపట్నం వెళ్ళి సంస్కృత, తెలుగు గ్రంధముల సంపాదకత్వం, ప్రచురణ జరపమని ప్రోత్సహించారు. చెన్నపట్నంలో సోదరులు ఇద్దరు శ్రీ వేదం వేంకటా చల శాస్త్రిగారితో కలసి 'వివేక రత్నాకర' ముద్రణాలయాన్ని ప్రారంభించి కొన్ని గ్రంధములు ప్రచురించారు. ఆశించినట్లు సాగకపోయేసరికి నెల్లూరువారైన శ్రీ ఆసూరి సరస్వతీ తిరువేంగణా చార్యులతో కలసి 'సరస్వతీ నిలయ ముద్రాక్షరశాల' స్థాపించారు. ఈ ప్రయత్నం కూడా విఫలమైంది.

1854లో రామస్వామి శాస్త్రిగారు ' ఆది సరస్వతీ ముద్రణాలయము' నెలకొల్పి, స్వయంగా తాటాకు ప్రతులు సేకరించి, పండితుల చేత పరిష్కరింపజేసి, తీరిక సమయాలలో స్వయంగా పరిశోధించి ప్రెస్ కాపీలు సిద్ధం చేసి, అచ్చుతప్పులు లేకుండా, ముచ్చట గొలిపే ముద్రణతో,

★ **మువ్వల సుబ్బరామయ్య గారు**, రచయిత, ప్రచురణకర్త, జయంతి పబ్లికేషన్స్ - విజయవాడ

మంచి కాగితముతో 140 పుస్తకాలను ప్రచురించి తెలుగు వారికి జ్ఞానదానం చేసిన మహనీయులు.

రామాయణం 18 సంపుటాలు, భారతమును దేవనాగర లిపిలోను ప్రచురించినపుడు, ఆ పుస్తకాలను పట్టపు ఏనుగు అంబారీపై ఉంచి, మంగళవాద్యములతో పురప్రముఖులు నగర ముఖ్య వీధులలో ఊరేగించి, వావిళ్ళ వారిని ఘనంగా సత్కరించారు

రామస్వామి శాస్త్రులు వారు 1891మే నెలలో దివంగతులైనారు.

## శ్రీ వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రులు (1884–1956)

వావిళ్ళ రామస్వామి శాస్త్రులు వారి కుమారులైన వేంకటేశ్వర శాస్త్రిగారు 1884 ఏప్రియల్ 1న జన్మించారు తండ్రిని మించిన తనయులు వేంకటేశ్వర శాస్త్రిగారు. కాలేజిలో ఎఫ్. ఏ. చదువుతూ చాలించి పుస్తక కంపెనీ వ్యవహారాలు చూసుకోవలసి వచ్చింది. వీరి కాలంలోనే ప్రెస్‌పేరు వావిళ్ళగా మారింది. వేయికి పైగా వివిధ గ్రంధాలను మేటి పండితుల చేత పరిష్కరింపజేసి నిర్దుష్టంగా ముద్రణ చేసి సాహిత్యాభిమానులకు వాటిని చదివే అవకాశం కలిపించారు.

శాస్త్రిగారు రాజకీయాలలో లోకమాన్య తిలక్‌గారి శిష్యులు. తిలక్ మాండలే జైలులో రచించిన 'గీతా రహస్యం' గ్రంధాన్ని తెలుగులోకి అనువదించి ప్రచురించారు. ఫెడరేటెడ్ ఇండియా అనే ఇంగ్లీషు వారపత్రికను, త్రివిజ్గ అనే తెలుగు మాసపత్రికను ప్రారంభించి తరువాత దానిని వారపత్రికగా నడిపారు. అంతా గ్రాంధికమే. పండితుల పాత ధోరణి. కాని సంపాదకీయాలు అద్భుతంగా వుండేవి. ఆంధ్రరాష్ట్ర సాధనలో త్రివిజ్గ పాత్ర ప్రశంసనీయమైంది. అది టంగుటూరి ప్రకాశం గారికి అండదండలుగా వుండేది. 'బాల వినోదిని' అనే తమిళ మాసపత్రికను శ్రీ సుబ్రహ్మణ్య భారతిగారి సహకారంతో ప్రచురించారు.

శృంగార ప్రబంధాల అచ్చుకు అడ్డుగా ఉన్న ప్రభుత్వ నిబంధనలు తొలగించడానికి 1911 నుండి ఆంధ్ర సారస్వత పరిషత్తుతోపాటు వావిళ్ళ వారు పడ్డ శ్రమ 1947లో ప్రకాశంగారు మంత్రి కాగా ఫలించింది. కపిలేశ్వరపురం జమిందారుగారు పాత పుస్తకాలను సంపాదించి వావిళ్ళవారికి, ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి ప్రచురణ కోసం చేర్చేవారు. అదోసరదా ఆయనకు.

శాస్త్రిగారికి పిల్లలు లేరు. బంధువుల పిల్లలను, అనాధ పిల్లలను చేరదీసి ఖర్చుపెట్టి చదువులు చెప్పించారు కాని, ఎవరినీ పెంపకానికి తీసుకోలేదు. శాస్త్రిగారికి సంఘసంస్కరణ అంటే గిట్టదేమో అనిపిస్తుంది - వీరేశలింగం గారికి ఎదురుగా పనిచేసిన కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రిగారిని ఆయన ప్రోత్సహించేవారు. వారి త్రివిజ్గ పత్రిక నిండా పూర్వాచారపు వ్రాతలే. అలాగే హరిజనోద్ధరణకు పూనుకున్న గాంధీగారి పద్ధతి కూడా ఆయనకి సరిపడలేదు.

సాంఘిక, సాహిత్య, సేవారంగాలలో దాదాపు ఐదు దశాబ్దాలు అవిరళకృషి చేసిన శాస్త్రిగారికి పక్షవాతం వచ్చి 1942లో మంచాన పడ్డారు షష్టిపూర్తి మహోత్సవం ఏప్రియల్ మూడు 1948లో చెన్నపట్నంలో కట్టమంచి రామలింగారెడ్డిగారి అధ్యక్షతన జరిగింది. వావిళ్ళ వేంకటేశ్వర శాస్త్రిగారి సేవలను గుర్తించి కాశీక్షేత్ర విద్వన్మండలి 'శాస్త్ర ప్రచార భూషణ' బిరుదమిచ్చింది. ఆంధ్ర పండితలోకం కడపలో గొప్ప సభ జరిపి 'భాషోద్ధారక' బిరుదు ప్రదానం చేసింది. 1955 డిశంబరులో ఆంధ్ర విశ్వవిద్యాలయం వారు 'కళాప్రపూర్ణ' బిరుదును ప్రదానం చేశారు.

ఫిబ్రవరి తొమ్మిది 1956న వేంకటేశ్వర శాస్త్రిగారు కన్ను మూసారు అంతే 1914లో స్థాపించిన త్రివిజ్ఞ పత్రిక మూతపడింది. వావిళ్ళ ఆంధ్ర నిఘంటువు అనాధయింది. మదరాసు గవర్నమెంటు వావిళ్ళ కంపెనీ యాజమాన్యాన్ని తీసుకుంది

# శ్రీ మానవల్లి రామకృష్ణ కవి
# (1866–1957)

మానవల్లి రామకృష్ణ కవిగారిది పండిత కుటుంబం. గొప్ప పండితులు ఎమ్. ఏ. పాసయ్యారు సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, ఇంగ్లీషు భాషలలో నిష్ణాతులు కవిత్వం చెప్పినందు వలన కవిగారు అనే బిరుదురాలేదు. ఆయన గొప్ప పండితుడు కాబట్టి అందరూ ఆయనను కవిగారు అని పిలిచేవారు. ఆయన సంస్కృత పాండిత్యం అపారం. హిందూ దేశంలోని గొప్ప సంస్కృత పండితులు ఆరుగురిలో ఆయన ఒకరని పేరు. బరోడా ప్రభుత్వం వారు ఆయన చేత భరతముని సంస్కృతంలో రచించిన నాట్యశాస్త్రానికి వ్యాఖ్య రాయించి ప్రచురించారు. మన పాత పుస్తకాలలో మూలపాఠం నిర్ణయించడం ఒక పెద్ద పరిశోధన

చెన్నపట్నంలో ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో పని చేస్తుండే వారు. ఊరూరు తిరిగి తాటాకు పుస్తకాలను పోగు చేసుకుని వచ్చి భాండాగారానికి సమర్పించి, వాటిని పరిశీలించడం ఉద్యోగవిధి. అక్కడ నుండి రాజమహేంద్రవరంలోని గవర్నమెంటు హైయ్యరు గ్రేడు ఎలిమెంటరీ ట్రయినింగు స్కూలుకి 1926లో సహాయోపాధ్యాయులుగా బదిలీ చేశారు.

కవిగారు తెలుగులో పూర్వప్రబంధాలను 'విస్మృత కవులు' అను గ్రంథమాల పేరుతో అచ్చువేశారు. ఆయనకున్న డబ్బంతా వాటికి త్యాగం చేయాలనే నిశ్చయంతో ప్రారంభించారు. కాని ఇరవై పుస్తకాలకంటే ముద్రించలేక పోయారు. ఆ గ్రంథమాలలో నన్నె చోడదేవుని కుమార సంభవ ప్రబంధాన్ని రెండు భాగాలుగా అచ్చువేశారు ఆ మహాకవి క్రీ.శ. 950 ప్రాంతం వాడని, నన్నయ భట్టుకి నూరేండ్ల పూర్వం వాడని ఆయన నిర్ణయించారు దాని మీద విమర్శల గాలి దుమారం రేగింది వినుకొండ వల్లభరాయడి రచన అని చెప్పబడే క్రీడాభిరామమనే పద్యకావ్యాన్ని కవిగారు ప్రచురించారు. ఇది శ్రీనాధుని రచన అని కొందరు విమర్శకులు తుఫానును లేవదీసారు ప్రచురించిన పుస్తకాలు అమ్ముడు కాలేదు.

కవిగారికి ఆర్థిక చిక్కులు విపరీతమైనాయి ఎమ్. ఏ., బి ఏ , పరీక్షలకు భాషా ప్రశ్నా పత్రాలను ఇచ్చేవారు. చివరకు హైయ్యరు ఎలిమెంటరీ గ్రేడ్ పరీక్షలకు కూడా ప్రశ్నాపత్రాలను ఇచ్చి తృణమో, పణమో పొందేవారు. మహా పరిశోధకుడు చేయవలసిన పనా! కూడబెట్టిన ధనం లేదు. కన్న కొడుకులు అక్కరకు రాలేదు.

రామకృష్ణకవి గారికి జీవితం చివరి దశలో తిరుపతి ప్రాచ్యపరిశోధనా సంస్థలో ఆశ్రయం లభించింది. ఆ తరువాత తిరుపతి దేవస్థానంవారే ఆయనకు ఉపాధి కల్పించారు. ఆయన కడపటి రోజులు మనశ్శాంతిగా ముగిసాయి.

వావిళ్ళగారు, మానవల్లివారు ఎన్నో బాధలు అనుభవించి సాహిత్య సేవ చేసి జాతికి శాశ్వత ప్రయోజనం కలిగించిన మహానుభావులు, ధన్యజీవులు. తెలుగు సాహిత్యం కోసం ఎంతో త్యాగం చేశారు. వారు కళను ఆస్వాదించి, మత్తెక్కి చేసిన పని. అదొక వ్యసనం, వాఙ్మయసేవ.

# స్వప్న బీభత్సంలో అక్షరాకృతి

## ( ప్రముఖకవి అజంతాగార్కి ఇటీవల కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు ప్రకటించిన సందర్భంగా ఈ వ్యాసం - సంపాదకుడు )

(గత సంచిక తరువాయి) - ప్రొ. వెంకట్

భాషను శరీరంగా, హింసను శరీరించుకుని, సహించుకొనే తనువు ఎంచుకొంటాడు కనుక అజంతా సాటిలేని ''భౌతిక వాది''. ఇక్కడ భౌతిక వాదం అంటే ఏదో స్కూలు బుక్కు సిద్ధాంతం ప్రకారం ''భౌతిక వాదాన్ని'' అజంతా మీద రుద్దటం లేదు ఇదివరకే వివరించినట్టు పరంపరల ఝుంఝూటాన్ని అజంతా Suspend చేస్తారు. రూపాకృతులను దిద్దే తనువుగా భాషలో జీవనాన్ని / మృత్యువును కొలుస్తాడు కాబట్టి భాష యొక్క ప్రాధమిక భౌతికతను ఆయన acute గా నిరూపణ చేస్తారు భాషని ఉపకరణంగా అలంకరించుకునే సిద్ధాంతాలు, జీవితాలు తమని క్రమబద్ధం (Regulate) చేసే పరిశీలించని తాత్విక దృక్పధ హర్మ్యాల్లోంచి బయట పడలేవు. అట్లాంటి సిద్ధాంతాలు, వాటి పోషకులు, ఎంత రాడికల్ వర్క్ చేస్తున్నాయనుకొన్నా ఘర్షణని జీవించడం, వారసత్వాలను కలవర పరచడం గురించి అజంతా ద్వారా నేర్చుకోవచ్చు

అట్లాగే మృత్యువునుంచి తప్పించుకోవాలనే తాపత్రయంతో ''కులాలు'', ''మతాలు'' మారేవాళ్ళు, జాతి సంప్రదాయ shelters ని, మూలాల్ని కొలిచేవాళ్ళు స్వప్నలిపిలోని ధైర్యాన్ని గమనించాలి మృత్యు ఘర్షణలో అజంతా ఎన్నుకొన్నది Stock బ్రాహ్మణ సంప్రదాయం కాదు. ఆయనకున్నది, ఆయన ఎంచుకొన్న, తొలచుకొంటున్న శబ్దశరీరమే వారసత్వపు మూలల ఘర్షణల్లో పోయేవి మనని వెంటాడే శృంఖలాలే గదా అంటారు అజంతా. ఆఖరికి తన సంతకాన్ని - The most unique and identifiable feature of a person - కూడా erase చెయ్యమంటాడు: ''నా సంతకంలో అక్షరాలు చూస్తేనే నాకు చెప్పలేనంత భయం''.

ముఖ్యంగా గమనించాల్సిందేమిటంటే మృత్యువనేది అజంతా రచనల్లో ఏదో తాత్విక ఇతివృత్తంగా చలామణికాదు. The randomness of death occurs in the banality of everyday existence: ఆకలి, దారిద్ర్యం, వంచన, నిరుద్యోగత, మతకలహాలు, రాజకీయాలు. కానీ ముఖ్యంగా చూడాల్సింది: బాధా ప్రేరితంగా అజంతాకు మరో రకమైన మరణం గురించికూడా తెలుసు - అదే గద్దర్ వర్ణించే అర్థవంతమైన మరణం (Quite remarkably Ajanta is painfully aware of the other death as well -- the one which Gaddar describes a meaningful death): ''మనిషి ఆలోచనలపై చీకటి అంగరక్షకుల పాషాణ హస్తాలు చూశాను. నిషిద్ధాక్షరాల మధ్య వరసలో చూశాను / ఎర్రని గాయాలపై సూర్యకిరణాల చిత్రలిపిని చూశాను. హఠాత్తుగా తలుపు తెరుచుకోవడం మృత్యువు. నడుస్తున్న రోడ్డులో మటుమాయం కావడం మృత్యువు మేదనీ చెరసాలలో రహస్య సంగ్రామం చూస్తున్నాను.. చీకటి నిబ్బరణం తర్వాతనే కదా కొత్త సృష్టి, కొత్త ప్రపంచం... ఈ లోగా నా శబ్ద శరీరంమీద ఆచ్ఛాదనలన్నీ విసర్జిస్తున్నాను శాశ్వతంగా / నగ్నాక్షరం కూడా ఒక ఆయుధమే.'' స్వప్నలిపిలో మృత్యువు కూడా రూపాంతరం చెందుతుంది అది ఒక మార్పులేని సర్వోత్కృష్ట సత్యం కాదు అందుకే అజంతా ఏ గమ్యప్రదమైన దార్శనిక మార్గాన్ని తొక్కకుండా విలయిస్తాడు. స్వప్నలిపిలో

మృత్యువు ఒక తప్పించుకోలేని భౌతిక సంఘటన (Rescapable happening). మృత్యు ఘర్షణే ఇక్కడ జీవితాన్ని రూపొందిస్తుంది, అక్షరాకృత కారకం అవుతుంది. ఈ ఘర్షణలో ఆలోచనలూ ప్రశ్నలూ విడదీయరాకుండా అల్లుకొని ఉన్నాయి స్వప్నలిపినిండా దీనికి తార్కాణాలు చూపొచ్చు ''జీవన వ్యూహంలో మహాసర్పంవలె ప్రవేశించిన / ప్రచండమైన ఆలోచనల వెనుక అన్నీ ప్రశ్నలే అనికదా నీ ప్రశ్న / మహా సర్పాలు మాట్లాడవు'' అంటే ఆలోచనలకి అంతులేదు, ఒక్క మృత్యువుతోనే వాటి అవినాభావ సంబంధం '' ఆలోచనల తోడేళ్ళు ఎవర్నీ వెంటాడవు ఈ రాత్రి / జీవితమనే పెద్దపులి ఎవర్నీ భయపెట్టదు ఇప్పుడు '' ''ఎప్పుడో ఎక్కడో జారవిడిచిన ఆలోచన మళ్ళీ పరిమళిస్తుందా'' ''ప్రశ్నకు సమాధానం ప్రశ్న / పెద్దపులి గుండెలలో కత్తులు విసురుతున్న మనిషిని నేను.''

ఇవేకాక స్వప్నలిపి నిండా ప్రశ్నార్థకాలే. కానీ ప్రతి ప్రశ్న, దాన్ని ప్రేరేపించిన ఆలోచనా వలయం జీవన్మృత్యువుల మధ్య భేదాన్ని సందిగ్ధంలో పడేస్తుంది; వాటి నిర్ధారిత రూపాల్ని మార్చేస్తుంది జీవితం పులిగా, ఆలోచనలు సర్పాలుగా, తోడేళ్ళుగా ప్రశ్నలు అగాధాల్లా మనని వెంటాడితే ఈ స్వప్నలిపిలో మరణాన్ని కోరే గొంతుకలు chorus లో విన్పిస్తాయి. అంటే ఇక్కడ మృత్యువును జీవితాన్నుంచి కానీ, జీవితాన్ని మృత్యువునుంచి కానీ నిర్ధారించి, అసంశయంగా విడదీయలేము. వాటి రూపాంతరాలు uncontrollable.

''చీకటి చిత్రశాల'' లో వక్తకున్నది ఒకటే ప్రశ్న· ''నేను సజీవంగానే ఉన్నానా?'' కానీ ఇక్కడ జీవన్మరణాలు విరుద్ధమైన పదార్థాలు కావు మృత్యువంటే మరో జీవన ద్వారం తెరుచుకోవడమేగా అంటాడు కవి. ఇక్కడ చీకటి కూడా అజంతా చిత్రకళలాగా ఒక నిగూఢమైన కావ్యం లాంటిది శ్లిష్ట నిగూఢ రచనల్ని సంకుచితం (reductive) గా చదవడం ఎంత పొరపాటో స్వప్నలిపిలోని enigmatic darkness (by extension death) (గాఢాంధకారం) ని స్థిరపడిన దృష్టితో చూడ్డం అంతే పొరపాటు. ఈ విషయంలో టారట్ (tarot) కార్డుల్లో stylized గా చిత్రించిన మృత్యు రూపాన్ని ముఖచిత్రానికి ఎన్నుకొన్న స్వప్నలిపి సంకలన కర్త (త్రిపురనేని శ్రీనివాస్) పూర్తిగా గుర్తించినట్టు లేదు. మృత్యు భీభత్సం అజంతా రచనల్లో ఆవరించుకొని ఉన్నా అదెప్పుడూ ఒకే దృష్టిలో - చెడుగానే (సాంప్రదాయ రీతుల్లో) కన్పించదు. మృత్యుభీభత్సాన్ని ఇక్కడ ఒకే దృష్టితో, ఒకే విలువతో చూడలేము. ''స్వప్నలిపి'' లోని విశేషం - ఈ సందర్భంలో ఏమిటంటే ద్వైతీకరించిన విలువలన్నింటినీ - మంచి / చెడు, మృత్యు / జీవనం, చేతన / అచేతన, చీకటి / వెలుతురు, శూన్య నిశ్శబ్దాలు / నిండుశబ్దాలు తలక్రిందులు చేసి displace చెయ్యడంతో వాటి ప్రాముఖ్యత సందిగ్ధంలో పడుతుంది

చీకటి ప్రవల్లికలో నడుస్తున్నాను అంటారు అజంతా. ''స్వప్నలిపి'' మొత్తానికి ఈ పంక్తి శిలాశాసనంలా వాడొచ్చు. పైన చెప్పినట్టు ''చీకటి చిత్రశాల'' ఎట్లాగైతే జీవన్మరణాల మధ్య భేదాన్ని సంశయంతో ప్రస్తుతిస్తుందో స్వప్నలిపి మొత్తంలో అర్థనిరర్థానర్థాల మధ్య అంతరం shift అవుతుంటుంది కొన్నిసార్లు పదాల లెవల్లో అర్థమైనట్టు అనిపిస్తుంది కొన్ని సార్లు కవిత మొత్తం మీద ఏదో గోచరిస్తుంది. మరికొన్ని సార్లు వాక్యాల్లో గూఢార్థం స్ఫురిస్తుంది. ప్రతీ పదానికి

individual (విడి)గా అర్థం అమరం ద్వారానో యాస్కుని ద్వారానో, పురాణాల్లోనో, ఇతిహాసాల్లోనో దొరికించుకోవచ్చునేమో గాని వాటి ఉనికి మారడంతో వాటి అస్థిత్వం కూడా మారి పోవచ్చునని అజంతా కవిత్వం సూచిస్తుంది.

అజంతా రచనలు మనకి పదే పదే గుర్తు చేసేదేమంటే ఈ unending metamorphosis of life / death is unmistakably played out on / as the body of language. మృత్యువు నుంచి జీవితం, జీవితం నుంచి మృత్యువు . ఇలా పరివర్తింపజేసేది మతి ఎలాంటి శరీరం? ఈ శరీర గుణమేమిటి? జీవితానికి (మంచివనీ) మృత్యువుకు (చెడ్డవనీ) ఆపాదించే విలువలను కంగారుపరచి, నెట్టివేసే ఈ శరీరం ఏమిటసలు? హింస సర్వభంగత, వైకృతి, గాయపరచడం మొదలైన వాటికి కార్యరంగమైన ఈ మాయా శరీరం (enigmatic body) - అయితే నూతన జన్మకు రంగమైన ఈ శరీరం - ఏమై ఉంటుంది? ఇది స్త్రీ శరీరానికి భిన్నమైన దేదైనా కాగలదా? (What kind of body is this that transforms persistently life from death and death into life? That which destabilizes and displaces the values attributed to life (as good) and death (as bad)? Above all what be this enigrratic body which is the site of violence and violation, mutilation and wounding - yet a body which is also the site for new birth? Can this be anything other than a woman's body?)

''స్వప్నలిపిలో'' హింసను శరీరించుకుంటూ, ఓర్చుకుంటూ, హింసను మోస్తూ, భరిస్తూ, చావుబ్రతుకుల ద్విపదల విలువలు మారుస్తూ Circulate అవుతున్న శబ్దశరీరం ముమ్మాటికీ స్త్రీ దేహమే. అజంతా ఉద్దేశపూర్వకంగా భాషని ఇలా ప్రతీకరిస్తున్నాడా అనే ప్రశ్న ఇక్కడ అసంబద్ధం. చావుబ్రతుకుల మధ్య వ్యత్యాసాన్ని స్వప్నలిపి ఎలా confourd చేస్తుందో, చేతన / అచేతనల మధ్య సరిహద్దుని అలానే మారుస్తుంది విమర్శ రచయిత ఆలోచనలే ప్రతిబింబించాలనే ప్రమాణం విమర్శ పరిధుల్ని Cripple (దుర్భరం / నిష్ఫలం) చేయటమే కాక రచయితని సాధికార మూర్తిగా కీర్తిస్తుంది. అలా అని విమర్శ ఊహాగానాలు చెయ్యలేదు. తన బాధ్యతను గుర్తించనిది విమర్శేకాదు.

అయితే స్వప్నలిపిలో జీవన్మృత్యు ఘర్షణలకి రూపాకృతి ఇచ్చేది స్త్రీ శబ్దశరీరమైనప్పటికీ వాస్తవంగా అవతరించే రూపాకృతులను పరిశీలిస్తే ఇంకొక ముఖ్యమైన విషయం కనిపిస్తుంది ఈ సంకలనములో చాలా సార్లు మళ్ళీ మళ్ళీ కనబడే ప్రతీక: శిరస్సు తెగినమొండాలు (decapitated poizted figure), దీపస్తంభాలు, శిధిల వృక్షాలు, రెండుగా చీలిన శిరస్సులు, ప్రయ్యలైన శిరస్సులు, ఖడ్గ విన్యాసాలు, ఖడ్గహతనాలు, ఖండితహస్తాలు, వెన్నెముకాభరణాలు, మనుష్యులు, మహాకాల సర్పాలు, మొదలగునవి. అట్లాగే కవిత్వానికీ ఆలోచనకీ వాహిక తన శిరస్సుగా కవి చిత్రిస్తాడు. ''నేను వ్రాసే కవిత్వం వేరు / శిరస్సు బద్దలై ప్రవహిస్తున్న సెలయేరు'' ఈ బద్దలైన శిరస్సులో ప్రవహిస్తున్న ''స్వప్నజలాలతో స్వచ్ఛమైన మనిషి ఒక క్షణం సాక్షాత్కరించినా చాలు '' ఈ ప్రతీకలన్నింటినీ పురుషపరిత్యాగ కారకాలుగా ఎంచవచ్చు. కాగా, చాలా వరకు ప్రతి కవితలో మాట్లాడుతున్న గొంతు పురుష స్వరంగానే గుర్తించవచ్చు (అజంతా అట్లాచేయకపోతే స్వప్నలిపిలో

అపశ్రుతులు వినిపించేవేమో) స్వప్నలిపిలో ఈ పురుషపరిత్యాగ ప్రతీకలు / కారకాలు స్త్రీ శరీర శబ్దం మీద రూపాంతరం చెందుతాయి కానీ ఈ రెంటి మధ్య భేదాన్ని స్వప్నలిపిలో తొలగించడం సాధ్యం కాదు ఈ క్షేత్ర ప్రతీకల వైవిధ్యం / వైరుధ్యం ఒక విలువైన ఉత్పాదక వైరుధ్యం అజంతా మగకవి కాబట్టి ఈ వెరుధ్యం తప్పదు అనుకోవడం పొరపాటు అవుతుందే తప్ప బాధ్యతాయుత విశ్లేషణకాదు ఉదాహరణకి గద్దర్ పాడే ''మగనాలు'' పాట ఖచ్చితంగా ఇట్లాంటి సమస్యనే సూచిస్తుంది కానీ గద్దర్ అక్కడ వాడిన ప్రతీకలు / కారకాలు అన్నీ womb centred - the dominant matrix there being the mother's womb and female voices.

అజంతా ఒక నిజాయితీ గల కవి కాబట్టి ఏదో పైపైన ఈ వైరుధ్యాన్ని పరిష్కరించరు. స్త్రీల సమస్యలను ప్రత్యక్షంగా ఇతివృత్తాలుగా తీసుకోరు తనకవిత్వంలో ''మనిషి'' అనే అమూర్తంలో స్త్రీ కూడా ఉంటుంది కదా అనే silly వాదంతో అజంతాని సమర్థించాల్సిన అవసరం లేదు. స్వప్నలిపిలో చీల్చుకొస్తున్న శకలమైన వాక్య పదీయాలన్నీ భాషను మౌలికంగా స్త్రీ శరీరంగా ఆవహించుకొన్న జీవనం లోంచి వచ్చేవే ఇదివరకు సూచించినట్లు అజంతా రచనలలో ఈ అవగాహనకి అసందిగ్ధమైన విలక్షణత మనకి భాషా శబ్దశరీరాల రోడ్డుతో పెనవేసే ప్రక్రియలో కనపడుతుంది రోడ్డు, దారి, మలుపులు, నాగటిచాళ్ళు - ఇవన్నీ inscriptions on / of woman's body (స్త్రీ శరీరోత్పాదక / స్త్రీ శరీరోత్పన్న లిపులే) అని ప్రత్యేకంగా విశదీకరించాల్సింది లేదు స్వప్నలిపిలోని బీభత్సాలు, ఖడ్గ విన్యాసాలు విలయతాండవాలు అగ్నిధారలు అన్నీ ఈ కృతిలోనే జరుగుతాయి. అక్షరాల జీవనానికి ఆశ్రయం అప్పుడే జనించిన శిశు శరీరం లేదా వీధి మనిషి దేహంలోనే ఉంటుంది అంటారు అజంతా. స్వప్నలిపిలోని వీధిమనిషి, అప్పుడే జన్మించిన శిశువుకు ఒక బలవత్తరమైన సంబంధం ఉంది ఇద్దరూ శకలజీవులు - ఖండిత శరీరాలే గదా? అప్పుడే జన్మించిన శిశువుకి తన శరీరావయాలపై అదుపు కాని, సమన్వయంకాని ఉండదు అట్లాగే అజంతా వీధిమనిషి మృత్యు ఘర్షణలో హమేషా శకలవికల మవుతున్న జీవి ఇదే అజంతా దైనందిన చిహ్నం. పోగా కొత్త సృష్టి అవతరించేది. చావు బ్రతుకుల ఘర్షణలో నుంచే కదా? ''పుడమి తల్లికి పురిటినొప్పులు కొత్త సృష్టిని స్ఫురింపించేయి'' దీనికంటే బలవత్తరంగా ''నొప్పి నొప్పికి ఊపిరద్దుతు / నింగినేలా ఉప్పెనవుతూ / గాలి పిడికిలి దీపశిఖలా / కదిలిపోతుంటే . కరకు కత్తుల ప్రాణ మిచ్చుట వీరస్వర్గముకే'' (కొండేపూడి నిర్మల, ''చావు బ్రతుకుల ద్విపద'').

అజంతా జీవితం స్త్రీ శబ్ద శరీర దారుల్లో మలపబడుతుంది అందులోంచే తన పురుష పరిత్యాగ బీభత్స ప్రతీకల్ని సస్య జీవన శబ్ద ప్రకంపనల్ని భాషలో తొలుస్తుంటారు సంప్రదాయికంగా భాషావిభజన చేసి పరుష శబ్దాలన్నీ (వికృత) పురుష రూపాలకే ఆపాదిస్తూ అజంతాలో అంతా పురుష గాంభీర్యానికీ ప్రవృత్తికీ, సార్వ భౌమత్వానికీ చెందిన పరుషాలు కొట్టొచ్చినట్టుంటే స్వప్నలిపిలో స్త్రీ శబ్ద శరీరం ఉందనడం ఏమిటి అనే సందేహం రావచ్చు నిజమేనేమో! కానీ ఈ విశ్లేషణలో మొదట్నించి మనం చూస్తున్నది అజంతా స్వప్నలిపి; ఒక జీవించే ఘర్షణగా ఈ ఘర్షణలో ముఖ్యంగా వివిధరూపాలలో మనల్ని నడిపించే పరంపరలను ప్రశ్నిస్తారు, కలవరపరుస్తారు అజంతా. ఈ పరంపరల్లో ఒకటి భాషా విభజన కదా! ఒకవైపు కవితా శబ్దసంపదను నియమబద్ధం చేయడం, మరోవైపు లైంగిక పరమైన భాషా ప్రయోగాన్ని సర్వ సాధారణం (universalize)

చేయడం ఈ వర్గీకరణలో భాగమే. సరళ, పరుషాలనే విభజన ఒక విధంగా లైంగిక వ్యత్యాసా (gender difference) న్ని ఆమోదయోగ్యం చేస్తుంది (అంటే భౌతిక లింగ భేదాల్ని నిరూపించాలని కాదు ఇక్కడ అర్థం. లింగ భేదం ద్వారా జనించిన నైతిక / మానవత్వపు వారసత్వపు విలువల్ని తిరిగి ప్రశ్నించాల్సిన అవసరాన్ని నొక్కి చెప్పడం) కానీ ఈ పరుష శబ్దాలే ఉపయోగిస్తున్నప్పటికీ ఇవి ఏదైవత్వాన్ని (పురుష) కీర్తించడానికో లేదా ఏ పురుషాధిపత్యాన్ని సుసంఘటితం చేయడానికో వినియోగించరు అజంతా ఈ వాక్యాలు చెప్పే ఉదంతాలన్ని ఖండిత శరీరాలగురించీ, విచ్ఛిన్న స్వప్నాల గురించి, శిధిల బీభత్స యోచనల గురించి, Violated bodies గురించి, హింసించిన భాష గురించి. ఈ భాష ఏ సార్వభౌమత్వాన్ని నిరూపిస్తుంది? ఏ అధిపత్యాన్ని పొగుడుతుంది, దేన్ని కొనసాగిస్తుంది? అయితే ఈ mutilated, violated body భాషలో, భాషతో ఖండించబడి, హింసించబడిన శరీరం ప్రథమంగా స్త్రీ శరీరమే గదా! ఈ శరీరాన్ని ఒక ఉదంతంలో పాత్రగా కాకుండా, కధనంలో వస్తువుగా కాకుండా, ఒక రూపాంతరం చెందుతున్న బీభత్సమైన క్షేత్రంగా, మార్గంగా అజంతా ప్రక్రియ చూపిస్తుంది. ఈ ప్రక్రియ సంకుచితంగా నియమబద్ధంచేయబడిన రూపసారాల కంటక చతురస్రాలను తలక్రిందులు చేస్తూ వాటిని కలవర పరుస్తూ, ఒక అసమాన క్రియగా స్వప్నలిపి సంశయాల్ని ఆకృతిస్తుంటుంది, పీడకలలను అక్షరీకరిస్తుంది.

అందుకే అజంతా ఒక చారిత్రక భౌతిక వ్యక్తిగా ఏమనుకొన్నప్పటికీ, ఆయన భాష గురించి ఏ సిద్ధాంతాన్ని ఆశ్రయించినప్పటికీ స్వప్నలిపి తొలుచుకొంటున్నది, వికసిస్తున్నది స్త్రీ శబ్ద శరీరమే ఇట్లాంటి శరీరం లోంచి చీల్చుకొచ్చిన శబ్దాంగాలన్నింటినీ ఏకం చేసి, బొడ్డుకోసి పేరు పెట్టాలని ప్రయత్నించరు అజంతా. పేర్లన్నీ పరంపరల నిరూపణ పత్ర తాపత్రాయలే కదా? తన సంతకాన్నే నిరాకరించే అజంతా ఈ ఝుంఝూటంలో ఎలా ఇరుక్కుంటారు? స్వప్నలిపిలో ఆ శబ్దాంగాల విస్ఫోటన మనం చూస్తాం. వాటిగమ్యాల relay లో అజంతా తలదూర్చరు. గన్‌పౌడర్ శబ్దాంగాల విస్ఫోటనాకృతులను వెలిదీయడమే ఆయన జీవనం. '' ప్రచురితమైన పద్యం ఏదీ నా దగ్గర ఉండదు ఉండనివ్వను. మరుక్షణం అది నా ముందు ధ్వంసం కావలసిందే. వ్రాసిన పద్యాలన్ని లోకం మీద ఆరవేయడం వరకే నా పని. తర్వాత ఆ పద్యాలతో నాకు నిమిత్తం లేదు. పద్యం ఏమైపోయినా, గాలిలో కొట్టుకు పోయినా ప్రమాదం లేదు.'' అంకురార్పణకి విస్ఫోటన ముఖ్యమైన కారకమని వృక్షశాస్త్రజ్ఞులు చెప్తారు. శబ్దాంగాలు ఎట్లానైతే భాషా జీవనం లోంచి చీల్చుకొస్తాయో, విస్ఫోటించిన శబ్దశరీరాలు వివిధ ఆకృతుల్లో అనిర్ధారిత గమ్యాలను తొలుస్తూ రావచ్చునేది స్వప్నలిపి సంకేతం. అదే అజంతా సంతకం· కవిత్వం ఒక రహస్యోద్యమం. అజంతాకి విస్తరించే విస్ఫోటన ముఖ్యం - ఏవో సూత్రాల గురించి చెప్పినట్టు, అక్షర పొట్లల్ని పొదుపు చేసి వంశవారసత్వ వృద్ధికి వినియోగించాలనే కుతూహలం లేదు స్వప్నలిపిలో. అందుకే విస్ఫోటించే, విస్తరించే శబ్దశరీరం అజంతా జీవితం తనను తాను చీల్చుకొని ఒక శకలమైన, అసంఘటితమైన అంగ సముదాయాన్ని బయట పడేసే జీవనం మరి స్త్రీదే కదా?

అయితే మరి అజంతా స్త్రీ వాదా? May be హింసా వాదేమో? మరి భాషా వాది అయ్యుండొచ్చు? తప్పకుండా ఆయన రూపవాది కావొచ్చు? ఏదైనా సంప్రదాయాలు, ప్రయోగం

లాంటి సూపర్ మార్కెట్ సాహిత్య చరిత్ర టెక్స్ట్ బుక్కుల్లో ఈయన్ని ఎలా ఇరికించవచ్చు? సందిగ్ధ సంధ్యలనుండి నవ్వుతారు అజంతా

నిశ్శబ్దానికి ఆకృతినిచ్చే వేదన అజంతాది. స్వప్న ఛ్ఛాయల్ని రూపించాలనే తపన అజంతాది ఈ రెండు సందర్భాలకీ మూలంగా నిలిచి శబ్దచ్ఛాయల్ని మింగేసే మృత్యువునుంచి రూపాల్ని వెలికితీసే ప్రయత్నమే స్వప్నలిపి నిరూపాలకి రూపాకృతులు మలుస్తూ, వాటి రూపాంతరాల వ్యాకుల జ్ఞానంతో జీవించడం సాహసమే కనిపించని, వినిపించని ''దైవత్వ'' మనే హర్మ్యాల్లో వసించలేని, వాటిని ఆశ్రయించలేని, వ్యక్తా వ్యక్త ఆలాపనలకు రూపాకృతులను లిపించడమే సాహిత్య ప్రక్రియ అజంతాకి. అగమ్యంలోని నిశ్శబ్దాన్ని, సందిగ్ధంలో ఒరిగిపోయిన ఆలాపనలకు పలికించి, ప్రకంపించాలనేదే ఇక్కడ ప్రయత్నం. అందుకే ఈ సంకలనంలో శబ్దంతో మొదలైన మహా నిశ్శబ్దంతో ''ముగించిన'' కవితలు ఏదో ఇతివృత్తానికి ఆద్యంతాలుగా భావించి స్వప్నలిపికి ఒక క్రమాన్ని నిర్ధారించలేము. ప్రతి కవిత చివర రచనాకాలాన్ని చూపించడంలో already సంకలనకర్త ఒక chronological sequence (కాలక్రమ పరంపరను) ఏర్పడనివ్వడు. కానీ ''శబ్దం'' నుంచి ''మహా నిశ్శబ్దం'' లోకి నిష్క్రమించడంతో సంకలనం కూర్పు ఏదో జననం నుండి మరణం వరకు అనే భౌతిక మార్గాన లేదా తాత్త్విక పథాన సాగుతుందనే సూచన కలిగిస్తుంది. పరస్పరం విరుద్ధంగా కనపడే ఈ పదచిత్రాలకీ రూపాలకీ మాతృక ఏదైనా ఉంటే అది మృత్యుఘర్షణకి రూపమిచ్చే ప్రయత్నమే ఈ దృష్ట్యా వరుసక్రమాల పరిణామానికి స్వప్నలిపిలో తావులేదు ప్రతి కవిత in this collection is a variedly repeated attempt at giving a face to the defaced or effaced apparitions and echoes.

అజంతా చూపుతున్న ఈ ప్రక్రియ గురించి కొద్దిగా ఆలోచిస్తే ''స్వప్నలిపి'' మనల్ని ఎప్పుడో తనలోకి లాక్కున్నట్లు నిపిస్తుంది నిగూఢమైన స్వప్నలిపికి స్పందించడం, ఇప్పటిదాకా మనం చేస్తున్న ఈ ప్రక్రియ కూడా అనిర్ధారిత సందిగ్ధాకృతంగా ఉన్న అజంతా రచనకి ఒక రూపాన్నిచ్చే ప్రయాసే కదా? అంటే మనకు తెలియకుండానే మనం కూడా అజంతా ప్రక్రియను ఇంకో స్థాయిలో మళ్ళీ ప్రయత్నిస్తున్నామా? స్వప్నలిపి ఏ విధంగానైతే ఒక ఘర్షణలో తిరుగుతుంటుందో, కావ్య విమర్శ కూడా అట్లాంటి ఘర్షణలోనే జీవిస్తుంటుందేమో! బాధ్యత గుర్తించిన ఈ ఘర్షణకి అంతం ఉండదనీ, గమ్యం దొరకదనీ, మౌలికంగా ఈ ఘర్షణే ఒక ఎడతెగని అంతర్ముఖ చింతన, జీవన క్రియ అని స్వప్నలిపి పదే పదే సూచిస్తుంది

మృత్యానంతర నిశ్శబ్దానికి ఆకృతినిచ్చే స్వప్నలిపి నిశ్శబ్దంలో ఊగిసలాడితే మృత్యుఘర్షణ, రూపాంతరించే ఆకృతుల తపన అంతమవుతుందని కాదు (బెర్లిన్ గోడ కూలిపోతే మార్క్స్ కు కాలం చెల్లిందని కొందరు **సదుకున్నోల్లు అమ్కున్నట్టు**) నిశ్శబ్దంలోని అవ్యక్తాలాపనలకోసం శబ్దశరీరాల ఘర్షణకి ఎవ్వరాపగలరు. మనకి తెలిసేలోగానే స్వప్నలిపి మనని ఆ ఘర్షణలో లిఖించేసిందే! అందుకే కావ్య ప్రక్రియకీ కావ్య విమర్శకీ పోలికలు ఉన్నప్పటికీ (రెండు ప్రక్రియలూ అనిర్ధారితాలకు ఆకృతులు సూచించే ప్రక్రియలు) ఈ ఘర్షణని కాలక్రమంగా (Chronologically) కాకున్నా మౌలికంగా 'కవే'' ప్రారంభిస్తాడు.

మనకు అందినట్లు నిరూపిస్తూనే దూరమౌతూ అంతుపట్టని ఆలాపనలకి ఆకృతిస్తూ మనని తనలోకి లాక్కుంటూ వెళ్ళే విరామ మెరుగని అగమ్య సంచారణే **స్వప్నలిపి.**

# నరకంలో శ్రీరామచంద్రుడు

**- నాగసూరి వేణుగోపాల్**

ఆరోజు నరకమంతా కల్లోలంగా వుంది. దానికి కారణం లేకపోలేదు. నరకలోకానికి శ్రీరామచంద్ర మహాప్రభువులు వేంచేస్తున్నారని అలా అలా తెలిసి పోయింది. నరకంలోని పాపులందరికి ఒకటే ఆశ్చర్యం! రాముడు నరకానికి వస్తున్నాడా అని గుసగుసలు, గందరగోళం మొదలైంది.

యమధర్మరాజుకు భయం ప్రారంభమైంది.

చిత్రగుప్తుడికీ మధ్య మతిమరపు, చిత్తచాపల్యం ఎక్కువయిన కారణంగా ఈ పొరపాటు జరిగిందేమోనని యముడికి అనుమానం కల్గింది. అర్జంటుగా చిత్రగుప్తుని పిలిపించాడు యముడు.

''ఏమయ్యా! యమలోకం మర్యాద తీసేస్తున్నావే? నీ చిట్టాలన్ని పిచ్చి, పిచ్చిగా వున్నాయి?'' అని యముడు గద్దిస్తే చిత్రగుప్తుడు గజ గజ వణుకుతూ ''మహాప్రభూ! నా తప్పిదం ఏమిటి? ఎందుకంత వర్రీ అవుతున్నారు?'' అని సారోఫేసు పెట్టాడు.

'' ఇంకేం చేయాలయ్యా .. నా కొంప ముంచేస్తున్నావే, శ్రీరాముడు నరకానికి వస్తున్నట్టు ఈరోజు పట్టీలో రాశావ్ .''

''అది తప్పుకాదు ప్రభూ! నేను నిమిత్త మాత్రుడినేకదా? అది మీకు తెలుసు. ఆయనగారి ప్రొఫైల్‌లో ఓ లిస్ట్ వుంది...''. అంటూ సణిగాడు చిత్రగుప్తుడు.

'' ఏమి తప్పులు చేశాడు?''

చాలా జాగ్రత్తగా తీసిపెట్టిన పుస్తకం తీశాడు చిత్రగుప్తుడు.

''దేవరా! వారి పేర ఈ అభియోగాలున్నాయి'' అని చిత్రగుప్తుడు పుస్తకమిచ్చి చూపాడు.

పాపులంతా ఉద్వేగంగా చూస్తున్నారు.

''మూర్తిభవించిన ధర్మం, పితృ వాక్యపరిపాలకుడు, ఏకపత్నీవ్రతుడు, దుష్టశిక్షకుడు అని పేరుపేరున కీర్తిస్తు కావ్యాలు, భజనలు రాయడానికి కవులు పోటీలు పడుతుంటే... నీవేమో యిలా రాశావ్?'' అని మరలా గద్దించాడు యముడు.

''అయ్యా, తమరు తొందరపడకండి, పొరపాటు లేనేలేదు'' అంటూ వేడుకున్నాడు చిత్రగుప్తుడు.

యముడు తగ్గినట్టు కనబడలేదు

''మహాప్రభూ! నాకు తెలుసు మీరు యిలా అడుగుతారని. అందుకే ఈ రెఫరెన్స్ బుక్ తెచ్చాను ''

''రెఫరెన్స్ బుక్కులు నా దగ్గర పనిచేయవు'' అని హూంకరించి, కాస్త శాంతపడి ''ఇంతకూ ఆ రెఫరెన్స్ బుక్ ఏంటి?'' అని అడిగాడు యముడు

చిత్రగుప్తుడు యిచ్చాడు.

''వాల్మీకి రామాయణమా?''

'' అవునుసర్, శ్రీరాముని బయోగ్రఫి చాలా సిన్సియర్‌గా రాశారు'' చిత్రగుప్తుడి జవాబు

''అంతా తికమకగా వుంది నా కొంప కూల్చేట్టు వున్నావే'' అంటూ హైరానాపడ్డాడు యముడు.

ఇందతా గమనించిన పాపులు, యిక్కడేదో కుట్ర జరుగుతోందని వర్రీ అయిపోయి, ''యముడు డౌన్ డౌన్'' అంటూ కేకలుపెట్టారు.

''రాముడు మాకు కంపెని యిస్తాడని ఆశగా వున్నాం. యమధర్మరాజు గారు పక్షపాతంతో వ్యవహరిస్తున్నారు. తన పలుకుబడి నుపయోగించి రాముడ్ని రక్షిస్తున్నాడు '' అంటూ పాపుల నాయకుడు ప్రసంగం మొదలుపెట్టాడు.

'' ఆగండయ్యా మీరు.. ఎందుకలా అరుస్తారు? రాముడు రాకపోతే సమ్మెచేతురులే.'' అంటూ బుజ్జగించే ప్రయత్నం చేశాడు చిత్రగుప్తుడు.

''యమధర్మరాజు గారు, అంత ఆలోచించ పనిలేదు. మన దగ్గర దాఖలాలున్నాయి. రాముడు వచ్చాక మీరే యింటరాగేషన్ చేయండి. కానీ ఒకసారి భవిషత్‌లోకి అలా చూడండి...'' అంటూ చెప్పాడు చిత్రగుప్తుడు

వీడియోలో ఫాస్ట్‌ఫార్వర్డు నొక్కినట్టు చకచకా దృశ్యాలు మారిపోతున్నాయి యమధర్మరాజు మస్తిష్కంలో!

''ఇదేంటయ్యా? మనకు అతిధులుగా వచ్చే వారిలో ధర్మరాజు, హరిశ్చంద్రుడు. వున్నారేమిటి?''

''చెప్పండి ప్రభూ''

''వీరి గురించి కూడా పొరపాట్లు చేస్తున్నావా?''

''మీ దగ్గర పని చేసేవాడిని మీరు మరీ స్ట్రిక్టు! ఆ సలసల కాగే నూనె నాకోసమే వాడగలరు...''

''మాటలు కట్టిపెట్టు . యమలోకం పరువు పోకూడదు తెల్సిందా?'' హుంకరించాడు యముడు

అంతలో కలకలం మొదలైంది - రాముడు వస్తున్నాడని! అంతా నిశ్శబ్దం, ఉత్సుకత!

శ్రీరాముడు వచ్చాడు?

''రఘుకుల తిలకా.. పాహిమాం'' అని యముడు బిగ్గరగా అన్నాడు.

''యమధర్మరాజా, మీరుకూడా పబ్లిక్ రిలేషన్స్‌లో ఆరితేరినట్టున్నారే'' అని అడిగాడు రాముడు.

యముడికి అర్థం కాలేదు.

అకారణంగా నరకంలో వుంచడం కూడా తప్పు అవుతుంది. అందుకని యింటరాగేషన్ ప్రారంభించడం మంచిదని భావించి, ''చిత్రగుప్తా, రాముడి తప్పిదాల లిస్ట్ యివ్వండి'' అని యముడు అడిగాడు.

దాన్ని రాముడికందజేసి ''మీరేమంటారు?'' అని అడిగాడు యముడు

''విడివిడిగా జవాబులు చెప్పాలా? లేదా అన్నింటికి కలిపి చెప్పాలా?'' అని రాముడు ఆప్షన్ యిచ్చాడు.

''మీ యిష్టం'' అన్నాడు యముడు

ఏదో గల్లంతు అవుతోందని భావించిన పాపులు ''యముడు రామపక్షపాతి జవాబులు విడివిడిగా యివ్వాలి'' అంటూ అరిచారు

''ఆగండయ్యా. అసలు డిసిప్లిన్ లేకుండా తయారయ్యారు'' అంటూ వారిని సముదాయించి ''రాముడు గారూ, కానివ్వండి'' అంటూ పురామాయించాడు చిత్రగుప్తుడు

''వారి అనుమానమూ కర్రెక్టే! అందుకే రెండు రకాలుగా జవాబు చెప్తాను'' అంటూ రాముడు చెప్పడం మొదలు పెట్టాడు ''అన్నింటికి కలిపి మీ ఐదవ అభియోగం జవాబు. ఇది పూర్తిగా అర్థం అయివుండదుగా, సరే.

మొదటిది.. తండ్రికిచ్చిన మాట తప్పడం! పదునాలుగు సంవత్సరాలు మునిలాగా జీవిస్తానని చెప్పి, ఆయుధాలు ధరించి ఎందరినో చంపడం జరిగింది కాబట్టి మొదటి అభియోగం కర్రెక్టే.

రెండవది. అకారణంగా చంపడం! ఋషులు వ్యవసాయం చేసుకోవాలని యాగాలు పేరుతో అడవులు తగలబెట్టడం అందులో వుండే రాక్షసులకు నచ్చలేదు ఋషులకోరిక మేర వారి మీద పగలేకుండా అకారణంగా రాక్షసులను చంపడం జరిగింది అయితే వారే నా యిమేజ్‌ను బూస్టప్ చేశారు కాబట్టి ఆ పనులు చేశాను. అందువల్ల రెండవది కూడా కర్రెక్టే!'' అంటూ రాముడు కొద్దిగా ఊపిరి పీల్చుకున్నాడు

''కానివ్వండి. '' అన్నాడు యముడు

'' ఇక మూడవది. భార్యను ఏడ్పించడం!

మా నాన్న గారికి మా తల్లుల వల్ల కలిగిన తలనొప్పులూ, కష్టాలతో విసిగి ఏక పత్నీవ్రతుడయ్యాను. అసలు సీతను చేసుకోవడంలో పెద్ద కథ వుంది. జనక మహారాజు గారింట్లో పాత శివధనుస్సు విరిస్తే మంచి వీరుడని పేరు వస్తుందని స్వయంవరానికి వెళ్ళాను. మీరు మొదట అడిగారే ఆ రెండు ప్రశ్నలే పదే పదే సీత నన్ను అడిగేది. చాలా న్యూసెన్స్‌గా వుండేది. నా వద్దకు వచ్చే మునుల వద్ద నన్ను నిలదీసి నా డిపాజిట్లు తీసేది. ఆమె నిలదీసి అడిగితే నేచెప్పాను - నీకన్నా పేరే ముఖ్యమని అయితే రావణుడు సీతను అపహరించడం వల్ల నాకు తలనొప్పి కొద్దిగా తగ్గింది. ఇది ఆమెను ఏడ్పించడమే గదా!. .

ఇక నాల్గవది అందరినీ ఏడ్పించడం! దీనికి వివరణ అవసరం లేదు మా నాన్నను ఏడ్పించాను, మా అమ్మను ఏడ్పించాను, లక్ష్మణుని ఏడ్పించాను, భరతుని ఏడ్పించాను ఇంకా వివరాలు కావలంటే వాల్మీకి నడగండి. ఇక చివరిది. . పబ్లిక్ రిలేషన్స్‌తో యిమేజి పెంచుకోవడం అసలు సమస్య యిదే గదా! ఇదే మూలకారణం, అసలు తప్పిదం... ''అంటూ ఉపన్యాసం ముగించాడు రాముడు

''యమధర్మరాజు గారూ, యింకా సందేహముంటే ఈ రెఫరెన్స్ బుక్ చూడండి'' అంటూ చిత్రగుప్తుడు వాల్మీకి రామాయణాన్ని యిచ్చాడు. దానికి రాముడు అక్కరలేదంటూ తన దగ్గరున్న నార్ల వెంకటేశ్వరరావు గారి ''సీత జోస్యం'' పుస్తకం యముడికిచ్చి, శిక్షకు సిద్ధమయ్యాడు!''



నాట్యకళా ప్రపూర్ణ బళ్ళారి రాఘవ

MISIMI/మిసిమి RNI Regd No 45042/90 Telugu Monthly, Hyderabad-500 020 Postal Regd. No. H/SD/191.



(శ్రీ) నాథ్ – సమకాలీన భారతీయ చిత్రకారుడు